5 మార్చి 2017

# ఆదివారం ఆంధ్రజ్యోతి

TARINI





## సముద్రంలోనూ సగం మేమే...

# హ్యాపీ విమెన్స్ డే

ఫిల్మ్ నగర్

సినిమాల్లో హీరోయిన్లుగా కాకుండా నిజ జీవితంలో మహిళలుగా ఈ నటీమణులు స్త్రీ స్వేచ్ఛ గురించి, సాధికారత గురించి ఏం చెపుతున్నారో చూడండి.



## గ్రామీణ మహిళనూ గుర్తించాలి

**మనది** గ్రామీణ భారతం అయినా నగర మహిళలకు దక్కినన్ని అవకాశాలు గ్రామీణ మహిళలకు దక్కడం లేదు. మహిళా దినోత్సవం రోజునైనా మనం సిన్సియర్‌గా ఈ విషయం గురించి ఆలోచించాలి. విమెన్‌హుడ్‌ను గుర్తించడానికి, సెలబ్రేట్ చేసుకోవడానికి ఇదొక చక్కని వేదిక. గ్రామీణ మహిళలు కూడా ఆర్థికంగా, సామాజికంగా నిలదొక్కుకున్నప్పుడే మహిళా సాధికారత అనే మాటకు అర్థం ఉంటుంది. మార్పు అనేది వ్యక్తితో మొదలై సామాజికంగా మారాలి. అప్పుడే మహిళలు స్వేచ్ఛగా, ధైర్యంగా ముందుకు అడుగేయగలుగుతారు.

- స్వర భాస్కర్

## సోదరే నా రోల్‌మోడల్

**నేనెప్పుడూ** విమెన్స్ డేను ప్రత్యేకంగా జరుపుకోను కానీ, ఆ రోజు నా జీవితంలో స్ఫూర్తిదాయకంగా నిలిచిన అనేకమందిని స్మరించుకుంటాను. వారికి కృతజ్ఞతలు తెలుపుకుంటాను. నా విషయానికొస్తే మా సోదరిని (ప్రియాంక చోప్రా) మించిన శక్తివంతమైన మహిళ మరొకరు లేరు. ఒక సాధారణ అమ్మాయి ప్రపంచ అందాలపోటీలో గెలిచి, ఆ తర్వాత సినిమాల్లోకి అడుగిడి అక్కడ కూడా నెంబర్‌వన్‌గా గుర్తింపు తెచ్చుకుని, హాలీవుడ్ సినిమాల్లో అవకాశాలు దక్కించుకోవడమంటే మాటలు కాదు. వృత్తిపట్ల ఎంతో నిబద్ధత, కఠోర శ్రమ ఉంటే తప్ప అది సాధ్యం కాదు. రోల్‌మోడల్స్ ఎక్కడో కాదు మన మధ్యనే ఉంటారు.

-పరిణీతి చోప్రా





## మహిళగా గర్విస్తున్నా...

**చాలామంది** నేను భారతీయుడ్ని అయినందుకు గర్విస్తున్నా అంటారు కదా... అలాగే నేను మహిళనైనందుకు గర్విస్తా. పెళ్లి చేసుకుని కూడా ధైర్యంగా బయటకు వెళ్లి నా వృత్తి నేను చేసుకునే స్వేచ్ఛ నాకున్నందుకు ఒక భారతీయురాలిగా గొప్పగా ఫీలవుతున్నా. చాలాకాలంగా మన దేశంలో ఒక అభిప్రాయం ఉంది. పెళ్లయిన తర్వాత మహిళలు ఇంటి పట్టునే ఉండిపోతారని. బయటికెళ్లి ఏ పనీ చేయరని. కానీ నేడు అనేకమంది మహిళలు వివిధ రంగాల్లో తమ సత్తా చాటుకుంటున్నారు. ఎంతో మందికి స్ఫూర్తినిస్తున్నారు. నా వరకు నేను మా అక్క కరిష్మాకపూర్ నుంచి స్ఫూర్తిపొందాను.

- కరీనాకపూర్

# INSIDE





**సముద్రంలోనూ సగం...**

అన్ని రంగాల్లో దూసుకు పోతున్న అతివలు సముద్రంలోనూ సగం... అంటూ నేవీలో అనేక విన్యాసాలు చేస్తున్నారు. అలాంటి కొందరు సాహస వనితల పరిచయం.

7



**ఆనంద సాయి**

సినిమాల్లో ఎన్నో అద్భుతమైన సెట్లు వేసిన కళా దర్శకుడు ఆనంద సాయి కెరీర్‌ను పణంగా పెట్టి స్థపతిగా ఎందుకు మారారు?

12



## మిత్రవాక్యం

సభలు సమావేశాలకే కాదు సంభాషణలకూ కొన్ని కొత్త వేదికలు అవసరం.
ఆ వేదికలు రౌండ్ టేబుల్సే కానక్కర్లేదు.
చెట్ల కింద కూడా కూర్చుని మాట్లాడుకోవచ్చు.
తెలిసిన వాళ్లతోనే మాట్లాడనక్కరలేదు.
అపరిచితులతోనూ సంభాషించవచ్చు.
కళ్లతో చూసుకుంటూనే మాట్లాడనక్కరలేదు.
కళ్లకు గంతలు కట్టుకుని కూడా సంభాషించుకోవచ్చు.
ఏమిటి దానివల్ల ప్రయోజనం అంటే ...



**రూపం** అనే కొలబద్ద మన మెదడు లోంచి దానంతటదే డిలీట్ అయిపోతుంది.

మనుషుల్ని మనుషులుగా స్వీకరించి సంభాషించడమనే **సంస్కృతి** అలవడుతుంది.

సంకోచాల్ని వదిలిపెట్టి సీరియస్ సమస్యల మీద కూడా అభిప్రాయాలను వ్యక్తం చేయగల **ధైర్యం** వస్తుంది.

ఇలాంటి సంభాషణలు ఇప్పటికే మొదలయ్యాయి ... బెంగళూరు, ఢిల్లీలలో. జానెట్ అనే మహిళ 'ఇంక్‌వీవర్' అనే సంస్థ పేరుతో వీటిని నిర్వహిస్తోంది. ■

## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### గ్లోబలైజ్డ్ 'ఈస్ట్‌విండ్'

ప్రపంచీకరణ పుణ్యమాని ఒకప్పుడు కత్తులు దూసుకున్న దేశాలు కూడా ఇప్పుడు ఒకే గొడుగు కిందకు చేరాయి. వాణిజ్య సంస్థలు తమ వస్తువులను అమ్ముకునేందుకు ప్రాంతీయ హద్దులను చెరిపేసి వినియోగదారుడిని వెతుక్కుంటూ ఎంత దూరమైనా వెళుతున్నాయి. వ్యాపార విస్తరణ కోసం చైనా నిర్మించిన 'ఈస్ట్‌విండ్ ఎక్స్‌ప్రెస్' బీజింగ్ నుంచి లండన్ దాకా ప్రయాణించడం వల్ల రవాణా ఖర్చులు భారీగా తగ్గి, అక్కడి వారికి కారు చౌకగా వస్తువులు దొరికే అవకాశం కలుగుతుంది. ఇది సామాన్యులకు సంతోషం కలిగించే విషయం.

**- అనితా జానకిరాం,** విశాఖపట్నం

### వేమన సందేశం

మూఢ నమ్మకాలతో.. మూఢాచారాలతో.. ఆర్థికంగా కోలుకోలేని సంసారాలెన్నో నేటికీ మన చుట్టూతా ఉన్నాయి. అనవసరంగా మోయలేనంత ఖర్చులెందుకు పెట్టుకుంటారో అర్థం కాదు. 'పితృకార్యం' కథలో 'పోయినోళ్లేమన్నా.. చూడొచ్చారా? తినొచ్చారా?' అంటూ రాజేష్ పాత్ర ద్వారా నేటి సమాజానికి అందించిన సందేశం వేమన పద్యంలా అనిపించింది.

**- గురప్ప జొన్నలగడ్డ,** శ్రీకాళహస్తి

### శంభో శంకర

శివునికి అన్ని నామాలు ఎలా వచ్చాయో తెలిపిన 'శంభో శంకర' కథనం చాలా బాగుంది. శివరాత్రి జరుపుకునేందుకు వెనకున్న కథలను, వివిధ శైవాలయాల్లో శివరాత్రి ఉత్సవాలు జరిగే విధానాన్ని తెలుసుకున్నాం. సముద్రంలో దాగిన శివాలయ విశేషాలు ఆశ్చర్యపరిచాయి.

**- సరికొండ శ్రీనివాసరాజు,** వనస్థలిపురం

### విద్యా మార్గదర్శి

విద్యకు, పుస్తకానికి యువత దూరమవుతున్న ఈ కాలంలో 'విద్యకు వయసుతో పనిలేదు.. మనసుంటే చాలు' అనే సందేశాన్ని ఇచ్చిన 'బామ్మల బడి' కథనం బాగుంది. ఊహించని విప్లవానికి నాందిలా కనిపిస్తున్న 'ఆజిబైచి శాల'ను స్థాపించిన యోగేంద్ర బంగర్‌కు శుభాభినందనలు.

**- కె. ఇర్ఫాన్,** పుంగనూరు,
**బైండ్ల అశోక్,** కృష్ణాపూర్

### ఎవరు మార్చగలరు?

ఇంటి పెద్దగా తల్లిదండ్రులను ఎలా చూసుకోవాలో తెలిసీ, అజ్ఞానంతో తమ ప్రవర్తనను తామే తిరిగి చూసుకోలేని వాళ్లను ఎవరు మాత్రం సరిదిద్దగలరు? ఈ వారం కథ 'పితృకార్యం'లో అంతర్గత భావాలను బాగా వ్యక్తపరిచారు. అయితే మనుషుల మధ్య గల అంతరాలను తొలగించలేకపోవడం బాధగా అనిపిస్తోంది.

**- మామిడాల వెంకటరాజం,** ఈమెయిల్




జైల్లో మొత్తం ఊచలు లెక్క పెట్టేశాడంట
ఎప్పుడు విడిచి పెడతారని అడుగుతున్నాడు!


వాళ్లిద్దరూ ప్రాణ స్నేహితులు
పాపం ఆ వెనకాలోడు మొన్ననే
పోయాడు!!


అయ్యా, రాజకీయాలన్నాక అవినీతి ఎలాగూ
తప్పదు. అడ్వాన్సుగా ఓ మూడేళ్లు జైల్లో
పడుండి రాజకీయాల్లోకి
వద్దామనుకుంటున్నా!!
అవినీతి నిరోధక
శాఖ


అయ్యో... పిల్ల నచ్చలేదని చెప్పారటగా?
పెళ్లిచూపులనాడు టిఫిన్ ఖర్చులు అడిగి
పట్రమ్మన్నారు పిల్ల తరఫు వాళ్లు!!


మన సుబ్బారావే... పిల్లలు అమెరికాలో
ఉన్నారని ఫోజులు కొట్టేవాడుగా... ఇప్పుడు
ట్రంప్ గాడు వెనక్కి పంపేస్తున్నాడని!!




# గెలాక్సీ రక్షకులు మళ్లీ వస్తున్నారు...

'మార్వెల్ కామిక్స్' ఆధారంగా వచ్చిన మరో సూపర్ హీరోస్ చిత్రం 'గార్డియన్స్ ఆఫ్ ది గెలాక్సీ'. 2014లో వచ్చిన ఈ సినిమా బాక్సాఫీస్ రికార్డులు సృష్టించింది. ఇప్పుడు దానికి సీక్వెల్‌గా 'గార్డియన్స్ ఆఫ్ ది గెలాక్సీ వాల్యూమ్ 2' చిత్రం రాబోతోంది. ఈ చిత్రానికి సంబంధించిన ట్రైలర్ ఫిబ్రవరి 12న విడుదలయింది. జేమ్స్ గన్ ఈ చిత్రానికి కథ అందించడంతో పాటు దర్శకత్వం వహించారు. విన్ డిసిల్, క్రిస్ ప్రాట్, జోయి సల్డానా, బ్రాడ్లే కూపర్ తదితరులు ప్రధాన పాత్రల్లో నటించారు. 'మరోసారి గెలాక్సీని కాపాడడానికి రెడీయా!' అనే డైలాగ్‌తో ట్రైలర్ మొదలవుతుంది. ఒక అద్భుతమైన లోకం... అందులో వింతైన జీవులు, మాట్లాడే జంతువులు.. ఆ గెలాక్సీని ప్రమాదాల బారి నుంచి కాపాడే సూపర్ హీరోలు.. వాళ్ల యాక్షన్ విన్యాసాలు.. ట్రైలర్ చూస్తుంటేనే ఒక కొత్త ప్రపంచంలో ఉన్నామనే అనుభూతి కలుగుతుంది. ఈ చిత్రం మే 5న విడుదల కాబోతోంది.

## ఇదో 'ఇష్క్ కహానీ'...

బాలీవుడ్ తర్వాత పంజాబీలో వీడియో ఆల్బమ్స్ ఎక్కువగా విడుదలవుతుంటాయి. తాజాగా ఫిబ్రవరి 21న విడుదలయిన 'ఇష్క్ కహానీ' వీడియో సాంగ్ ట్రెండింగ్‌లో దూసుకుపోతోంది. బ్లూ హాక్ ప్రొడక్షన్‌పై లవ్ కోట్కపురివాలా దీన్ని నిర్మించారు. సోనూ సిధు దర్శకుడు. జితేందర్ బలూరియా సంగీతాన్ని అందించడంతోపాటు తానే స్వయంగా పాట పాడి.. ప్రధాన పాత్రలో నటించాడు. కేవలం మూడున్నర నిమిషాల నిడివి ఉండే ఈ వీడియో సాంగ్‌లో మూడు చిన్న చిన్న ప్రేమకథలు ఉంటాయి. ఈ కాలంలో ప్రతి ఒక్కరికి మరిచిపోలేని ఒక ప్రేమకథ ఉంటుందని చెప్పిన విధానం ఆకట్టుకుంటుంది. బొమ్మలతో ఆడుకునే ఒక చిన్న పాప అవి కనబడకపోయేసరికి ఏడవడాన్ని చూపించిన విధానం కూడా బాగుంది. ప్రేమలో ఓడిపోతే ఆత్మహత్య చేసుకోవడం కాదు, నిన్ను బాధపెట్టిన వాళ్ల ఈర్ష్య పడేలా ఎదిగి చూపించాలనే సందేశం చివరలో ఉంటుంది.




## నవ్వుల ఇంటర్వ్యూ...

'వైవా' షార్ట్ ఫిల్మ్ ద్వారా పాపులర్ అయిన హర్ష నటించిన తాజా షార్ట్ ఫిల్మ్ 'ది ఇంటర్వ్యూ'. ఇందులో ఇంటర్వ్యూ చేసే ఆఫీసర్‌గా హర్ష నటించాడు. కామెడీ వీడియోలకు యూట్యూబ్‌లో ఎప్పుడూ వ్యూస్ ఎక్కువగానే ఉంటాయి. గత ఏడాది డిసెంబర్ 27న విడుదల అయిన ఈ షార్ట్ ఫిల్మ్ ఇప్పటిదాకా 27 లక్షలకు పైగా వ్యూస్ సాధించి ఫేస్‌బుక్ షేరింగ్స్‌లో టాప్‌లో నిలిచింది. మొదటి సీన్ నుంచి చివరి సీన్‌దాకా కడుపుబ్బా నవ్వించే ఈ వీడియోకు 42 వేలకు పైగా లైక్స్ రావడం విశేషం. ఒక సినిమా ఆడియో ఫంక్షన్‌లో అల్లుఅర్జున్ చెప్పిన కామెంట్ 'చెప్పను బ్రదర్' ఎంత పాపులర్ అయ్యిందో తెలిసిందే. దాన్ని కూడా ఇందులో ఉపయోగించి నవ్వించారు. నాణ్యత లేని ఇంజనీరింగ్ కళాశాలలు అందించే విద్యను, పనికి రాని కంప్యూటర్ కోర్సులను నేర్పించే కోచింగ్ సెంటర్లను పాయింటవుట్ చేస్తూ సంధించిన వ్యంగ్యాస్త్రం ఇది.



పిల్లల స్వీయ ఒత్తిడికి, తల్లిదండ్రుల ఒత్తిడి కూడా తోడైతే... ఇక ఆ ఇంటి వాతావరణం ఎలా ఉంటుందో చెప్పక్కర్లేదు. పిల్లలందరూ ఆ ఒత్తిడిని ఒకేలా నిభాయించుకోలేరు. అందుకే కొందరు భోజనం తినడం తగ్గిస్తారు. కొందరు తల తిరుగుతుందని, కడుపు నొప్పని బాధపడుతుంటారు. ఇవన్నీ మానసికమైనవే.





# 'ఎగ్జామ్ ఫీవర్'.. బయటపడేదెలా...?

**పరీక్షలు దగ్గర పడే కొద్దీ మా అబ్బాయిలో ఆందోళన పెరిగిపోతుంటుంది. సరిగ్గా భోజనం కూడా చేయడు. మాటిమాటికీ తల తిరుగుతుందంటాడు. డాక్టర్లకు చూపిస్తే సమస్యేం లేదంటున్నారు. దీనికి పరిష్కారం ఏమిటి?**

• **కె. నగేష్,** మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా

ఈ మధ్య చాలామంది తల్లిదండ్రులు ఎదుర్కొంటున్న సమస్య ఇది. పరీక్షలు ఇంకో పది రోజుల్లోనో, ఇరవై రోజుల్లోనో ప్రారంభమవుతాయనగా చాలామంది ఇళ్లల్లో గంభీరమైన వాతావరణం చోటు చేసుకుంటుంది. ఒక యుద్ధానికి సన్నద్ధమయ్యే సైనికుల గుడారంలో ఉండే టెన్షన్ వాతావరణం కనిపిస్తుంది. ఇది పిల్లలపై ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చాలా ప్రభావం చూపుతుంది. పిల్లలు పరీక్షలకు ఎంత బాగా ప్రిపేరవుతున్నా మార్కుల గురించి ఆలోచిస్తూ తల్లిదండ్రులు ఆందోళన పెంచుకుంటుంటారు. ఫలానా సబ్జెక్టులో తక్కువ మార్కులు వస్తే ర్యాంకు పడిపోతుందేమోనని తాము భయపడి, పిల్లలను ప్రెజర్‌కు గురిచేస్తుంటారు. పిల్లలు స్కూలు నుంచి ఇంటికి వచ్చాక నిమిషం కూడా రెస్ట్ ఇవ్వకుండా ఆదరాబాదరాగా వాళ్ల నోట్లో స్నాక్స్ కూరి, పుస్తకాలు చేతికిచ్చి గదిలోకి తోసేస్తారు. పరీక్షలయ్యేదాకా పక్కింటి పిల్లలతో మాట్లాడకూడదు, ఎదురింటి పిల్లలతో క్రికెట్ ఆడకూడదు అని అనేక షరతులు పెడుతుంటారు. పిల్లల స్వీయ ఒత్తిడికి, తల్లిదండ్రుల ఒత్తిడి కూడా తోడైతే... ఇక ఆ ఇంటి వాతావరణం ఎలా ఉంటుందో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. పిల్లలందరూ ఆ ఒత్తిడిని ఒకేలా నిభాయించుకోలేరు. అందుకే కొందరు పిల్లలు భోజనం తినడం తగ్గిస్తారు. కొందరు తల తిరుగుతుందని, కడుపు నొప్పని బాధపడుతుంటారు. ఇవన్నీ మానసికమైనవే. దీనికి ఇంటి వాతావరణాన్ని మార్చడం ఒక్కటే పరిష్కారం.

స్కూళ్లనుంచి, కాలేజీల నుంచి పిల్లలు వచ్చే సమయానికి ఇంటిని ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా ఉంచాలి. వాళ్లు రిలాక్స్ అవడానికి కనీసం ఓ అరగంట సమయమైనా ఇవ్వాలి. వాళ్లకు ఇష్టమైన వంటలు చేసి పెట్టాలి. కాసేపైన వాళ్లు తమకిష్టమైన మ్యూజిక్ వినేందుకు అనుమతించాలి. ముఖ్యంగా పరీక్షలనేవి జీవితాన్ని నిర్దేశించేవనే





భావనను వాళ్ల మనసుల నుంచి తొలగించాలి. వారిలో ఆత్మవిశ్వాసాన్ని నింపే మాటలే మాట్లాడాలి. నెగిటివ్ కామెంట్స్ అస్సలు చేయొద్దు. సాధారణంగా తల్లిదండ్రులు చేసే మరో తప్పు ఏంటంటే... పిల్లల ఎదురుగానే 'వాడు చదివే చదువుకు ఈ సారి ర్యాంకు రావడం కష్టమే' అనేస్తుంటారు. ఇలాంటి ప్రతికూల మాటల ప్రభావం వారిపై బలంగా పడుతుంది. తల్లిదండ్రులు గుర్తుంచుకోవాల్సింది ఒక్కటే... 'ఎ హ్యాపీ చైల్డ్ ఈజ్ ఆల్వేస్ సక్సెస్‌ఫుల్ చైల్డ్'. అందుకే తల్లిదండ్రులు ముందు తమపై ఒత్తిడి తగ్గించుకుని పిల్లలకు సౌకర్యవంతమైన వాతావరణాన్ని కల్పిస్తే 'ఎగ్జామ్ ఫీవర్' వాళ్ల దరిదాపుల్లోకి కూడా రాదు.



**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్
కిమ్స్ హాస్పిటల్
sujatharajamani10@gmail.com

మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా సందేహాలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.
**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com

కవర్‌స్టోరీ




# సముద్రంలోనూ సగం మేమే...

● చిగురుపాటి సతీష్‌బాబు, విశాఖపట్నం,

● ఎం. కృష్ణ, న్యూఢిల్లీ,

చీకటి రాత్రుల్లో తీరంలో వినిపించే నిశ్శబ్ద ఘోష భయాన్ని కలిగిస్తుంది.

సూర్యుని వెలుగులో సైతం నీలిపచ్చ సంద్రం మనస్సుల్లో తెలియని గుబులు రేపుతుంది.

లోతెంతో తెలియదు, ఆవలి దరి కనిపించదు.

రేయింబవళ్ళు తేడా లేకుండా రోజుల తరబడి ప్రయాణం.

నిన్నటి వరకూ పురుషునికి మాత్రమే సాధ్యమనుకున్న నౌకా సారథ్యం లింగభేదాలను చెరిపేసే దిశగా పయనిస్తోంది. మీరేమీ తక్కువ కాదు, తలుచుకుంటే ఒకింత ఎక్కువేనంటూ సముద్రుడు సైతం మహిళలకు సగౌరవంగా దారి ఇస్తున్నట్టున్నాడు.

సందర్భమేదైనా, సన్నివేశమేమైనా... శక్తి సామర్థ్యాలు మాత్రమే కొలమానమైన చోట జండర్ వివక్షకు తావేలేదంటూ నిష్కర్షగా, క్రియాశీలకంగా ప్రపంచానికి చాటి చెపుతున్నారు భారతీయ నావికాదళంలోని మహిళలు.

అత్యంత సాహసోపేతమైన సముద్రయానాలను సునాయాసంగా పూర్తి చేసుకుని నీలి సంద్రంలో ప్రపంచాన్ని చుట్టిరావటానికి సిద్ధమవుతున్న సాహస వనితలు కొందరైతే, సాగర తీరాన్ని కాపలా కాస్తున్న డేరింగ్ డిఫెన్స్ 'కోస్ట్‌గార్డ్స్' మరికొందరు. 'అంతర్జాతీయ మహిళా దినోత్సవం' (మార్చి 8) సందర్భంగా సముద్రంలో ధైర్యంగా సాగిపోతున్న ఆ ధీరవనితల అనుభవాలే ఈ వారం కవర్‌స్టోరీ.

## ప్రపంచ యాత్రకు సిద్ధం

I am Lft Cdr Swathi. నేను ఇంత ధీవిగా, గర్వంగా నా పేరును చెప్పటం వెనుక చాలా కష్టాలున్నాయి. మా నాన్న నావెల్ డాక్ యార్డ్‌లో కుక్‌గా పనిచేసేవారు. అమ్మ సెయిలింగ్ సెంటర్‌లో పనిచేసేవారు. మేం ముగ్గురం. ఇద్దరు అక్కల తరువాత నేను. నాకు ఊహ తెలిసినప్పటి నుంచీ నాన్న నన్ను ఒక నేవీ ఆఫీసర్‌గా చూడాలని కలలు కనేవారు. దానివల్ల చుట్టుపక్కల వారి నుంచి, చుట్టాల నుంచి సూటిపోటి మాటలు ఎన్నో. స్థోమతకు తగ్గట్టుగా ఆలోచనలు చేయాలంటూ వెక్కిరింతతో కూడిన హెచ్చరికలూ చేసేవారు. అయినా వీళ్ళు ఆడపిల్లలు, వీళ్ళను ఒక పద్ధతిలోనే పెంచాలి అని అమ్మానాన్నలు ఎప్పుడూ అనుకోలేదు. మేం ఆడపిల్లలు అన్నట్లు కాకుండా మేం వాళ్ళ పిల్లలం మాత్రమే అన్నట్లుగా అమ్మ ధోరణి వుండేది.

నా చదువంతా తెలుగు మీడియంలోనే సాగింది. నేవెల్ ఎన్‌సిసిలో సి సర్టిఫికెట్



పూర్తి చేశాను. దానిలో భాగంగా సెయిలింగ్‌కు వెళ్లేదాన్ని. సర్వీస్ సెలక్షన్ బోర్డు పరీక్షకు హాజరయ్యాను. 2011, డిసెంబర్ 26న నేవీ అకాడమీలో చేరాను. నాకు అప్పటికి ఇరవై ఏళ్ళు. అత్యంత క్లిష్టమైన ఆరు నెలల శిక్షణను పూర్తి చేశాను. నాకు ఎందుకనో మొదటి నుంచీ డెస్క్ జాబ్ ఇష్టం వుండేది కాదు. ఆపరేషనల్ సైడ్ వుండాలని నిర్ణయించుకున్నా. ప్రపంచంలోనే సెకండ్ టఫెస్ట్ జాబ్‌గా అందరూ భావించే ఎయిర్ ట్రాఫిక్ కంట్రోల్‌లో చేరాలని నిర్ణయించుకున్నా. దాంతో మరో ఆరు నెలలు దుండిగల్ ఎయిర్‌ఫోర్స్‌లో శిక్షణ తీసుకోవలసి వచ్చింది. 2012లో ట్రైనింగ్ పూర్తి చేసుకున్న తరువాత నా స్వంత ఊరు విశాఖను ఎంపిక చేసుకున్నా. రెండున్నరేళ్ళు ఐఎన్ఎస్ డేగాలో ఎటిసిలో పనిచేశాను.

2014 నా జీవితాన్ని మరో మలుపు తిప్పింది. ఇండియా జనరల్ నోటిఫికేషన్ వెలువడింది. దక్షిణాఫ్రికాలో కేప్‌టౌన్ నుంచి రియో వరకూ జరిగే ప్రతిష్ఠాత్మక పోటీలలో పాల్గొనటానికి స్వచ్ఛందంగా ముందుకు వచ్చేవారిని ఆహ్వానిస్తూ వెలువడిన ప్రకటన అది. అట్లాంటిక్ సముద్రాన్ని దాటే ప్రక్రియ అది. నేను, వర్తికా జోషి దరఖాస్తు చేసుకున్నాం. ఎంపిక ప్రక్రియ ప్రారంభమయ్యింది. వర్షంతో కూడిన చలి. సముద్రం రఫ్‌గా వుంది. చిన్న బోటు ఇచ్చి వెళ్ళి రమ్మన్నారు. మేం సముద్రంలోకి వెళ్ళి వచ్చేసరికి మీరు సెలెక్టయ్యారని చెప్పారు. సాహసయాత్రలో తొలి అడుగు అది.

2014లో కేప్ టౌన్ నుంచి భారత్ కు తిరిగి వచ్చే జట్టులో నేను సభ్యురాలిని. 37 రోజులు నాన్ స్టాప్ సెయిలింగ్. బేస్‌కు వచ్చిన తర్వాత నేను ఎంత సాహసానికి పూనుకున్నానో మెల్లిగా అర్థమైంది. ఆ ప్రయాణం నాలో ఆత్మస్థైర్యాన్ని, స్ఫూర్తిని నింపింది. ఆ తరువాత మహిళా అధికారులతో యాత్రను చేపట్టాలని నేవీ భావించింది. వేరే విభాగాలలో పనిచేస్తుంటే సెయిలింగ్ సాధ్యం కాదు. దీనితో గోవాలోని ఐఎన్ఎస్ మాండవికి నన్ను ఎటాచ్ చేశారు. 2015లో నాతో పాటు వర్తిక, ప్రతిభ నాతో జత కలిశారు. మేం కోర్ టీమ్‌గా ఏర్పడ్డాం. దిలీప్ దోండే మాకు శిక్షకులు.

సెయిలింగ్‌లో అత్యంత కీలకమైన విషయాలు కొన్ని ఉన్నాయి. మనం ప్రయాణించే బోటు గురించి అణువణువూ తెలిసి వుండాలి. దాని శక్తి సామర్థ్యాలపై పూర్తి అవగాహన వుండాలి. జట్టులో సమష్ఠితత్వం వుండాలి. ఆయా విపత్కర సందర్భాలలో ఒకేలా ఆలోచించి కార్యాచరణలోకి దూకాలి. ఇది చెప్పినంత తేలిక కాదు. మేం అందుకు సిద్ధమయ్యామా లేదా అన్న పరీక్ష ప్రారంభమయ్యింది. ఐఎఫ్ఆర్ కోసం విశాఖకు వచ్చిన ఐఎన్ఎస్ వి మధాయి(సెయిలింగ్ కోసం ఉద్దేశించిన తెరచాప నౌక)ని తిరిగి గోవాకు తీసుకెళ్లాలి. విశాఖ నుంచి చెన్నై, కొచ్చి మీదుగా గోవాకు 19 రోజుల్లో చేరుకున్నాం. ఆ తర్వాత 2016 మే 24వ తేదీన మారిషస్‌లోని పోర్టు లూయిస్‌కు వెళ్ళి తిరిగి వచ్చాం. మొత్తం ఆరుగురు సభ్యులం. వర్తిక జోషి, నేను, ఐశ్వర్య, ప్రతిభ, విజయ, పాయల్ ... భవిష్యత్తులో మేం చేయబోయే ప్రపంచయాత్రకు ఇది ఒక సన్నాహక యాత్ర. ఎన్నో కష్టాలు, అనుకోని అవాంతరాలు ఎదురయ్యాయి. వాటిని అధిగమిస్తూ చివరికి మారిషస్ చేరుకున్నాం. 21 రోజులు పట్టింది. అక్కడ ఆరు రోజుల విశ్రాంతి తర్వాత తిరిగి గోవా చేరుకున్నాం. దాంతో మాపై మాకు నమ్మకం బలపడింది.

ప్రతీ మూడేళ్ళకోసారి దక్షిణాఫ్రికాలో కేప్ - రియో రేస్ జరుగుతుంది. ఎంతో ప్రతిష్ఠాత్మకంగా జరిగే ఈ రేస్ 1943 నుంచి జరుగుతోంది. రాయల్ కేప్ యాచెట్ క్లబ్ నిర్వహించే ఈ రేస్‌లో పాల్గొనడానికి కెప్టెన్ అతుల్ సిన్హా నాయకత్వ బాధ్యతలు స్వీకరించారు. మా ఆరుగురు మహిళా బృందంలో కేవలం ఇద్దరం మాత్రమే రేస్‌లో పాల్గొనడానికి ముందుకు వచ్చాం. నేను, పాయల్ రేస్ లో పాల్గొంటామని కెప్టెన్‌కు తెలిపాం. ఐఎన్ఎస్ వి మధాయిని కేప్‌కు తీసుకువెళ్ళే బాధ్యతను మా మహిళా బృందానికి అప్పగించారు. 2016 నవంబర్‌లో ప్రారంభమైన మా 5 వేల నాటికల్ మైళ్ళ ప్రయాణం 45రోజుల పాటు సాగింది. డిసెంబరు 23న కేప్‌టౌన్ చేరుకున్నాం. ఏడు రోజుల పాటు రేస్‌లో మెలకువలను నేర్చుకున్నాం. రేస్‌లో నేను, పాయల్ మాత్రమే మహిళం. లెఫ్టినెంట్ సంజయ్, నితిన్ ప్రకాష్, కమాండర్ బినోయ్‌లు మా సహచరులు. ఈ రేస్‌లో మేం సరికొత్త రికార్డును నెలకొల్పాం. 2014లో ఈ రేస్ ను పూర్తి చేయటానికి 31 రోజులు పడితే ఈసారి కేప్ నుంచి రియో డి జనీరోకి 20 రోజుల, 20 గంటల, 28నిమిషాల 13 సెకండ్లలో చేరుకున్నాం. దాంతో 'ది ఫాస్టెస్ట్ ఇండియన్ టీమ్ దట్ క్రాస్డ్ అట్లాంటిక్' అన్న రికార్డు మా స్వంతమయ్యింది. జనవరి ఒకటిన ప్రారంభమైన ఈ రేసులో మా కంటే ఆరు రోజుల ముందు ప్రారంభమైన అనేక నావలను ఓడించి 17వ స్థానంలో నిలిచాం.

ఏ అమ్మాయైనా తాను అమ్మాయిని అన్న భావనను జయిస్తే విజయపు తొలిమెట్టు ఎక్కినట్టే. మిగిలిన దేశాలతో పోల్చితే మహిళలను చూసే పురుష దృక్కోణంలో మన దేశంలో ఒకింత మార్పు అవసరమే. అయితే మార్పు ప్రారంభమయ్యింది. మరికొంత సమయం పడుతుంది అంతే. మరో రెండు మూడేళ్ళలో భారత నావికాదళ యుద్ధ నౌకల్లో మహిళలను చూస్తామని చెప్పటంలో అతిశయోక్తి లేదేమో.

**● స్వాతి, లెఫ్టినెంట్ కమాండర్**

## ముందస్తు శిక్షణే కీలకం

నాన్న ఎడ్యుకేషనల్ సైకాలజిస్టు, అమ్మ హిందీ సాహితీవేత్త. సోదరుడు ఎంబెడెడ్ సిస్టమ్స్‌లో మాస్టర్స్ చేశాడు. నా బాల్యమంతా శ్రీనగర్‌లో గడిచింది. నాన్న సాహస క్రీడలను అమితంగా ప్రేమించేవారు. పర్వతారోహణలకు తరుచూ వెళ్ళేవారు. అది నాకు ప్రేరణగా నిలిచింది. అయితే చిన్నప్పటి నుంచీ కొండలకు అత్యంత దగ్గరగా పెరగడం వల్ల సముద్రం ఎలా వుంటుంది? సముద్రంలో ప్రయాణం ఏ అనుభూతులను ఇస్తుందన్న విషయాలపై చాలా ఉత్సుకతతో వుండేదానిని. ఈ ఆలోచనలే నన్ను నేవీ వైపు నడిపించాయి. పర్వతారోహణ కన్నా సముద్రంలో ప్రయాణం తేలికైనదేమీ కాదు. కొన్నిసార్లు భయం కలిగేది. కొన్నిసార్లు అబ్బురమనిపించేది. నా తొలి ప్రయాణంలో కలిగిన అనుభవాలన్నిటినీ నేను ఎప్పటికీ చెప్పలేనేమో.

మిగిలిన సముద్రాలతో పోలిస్తే మాన్‌సూన్




సీజన్‌లో హిందూ మహాసముద్రం చాలా రఫ్‌గా వుంటుంది. అలాంటి వాతావరణ పరిస్థితులలో మారిషస్ వెళ్లాం. ఇదంతా 2017 ఆగస్టులో మేం చేపట్టబోయే ప్రపంచాన్ని చుట్టి వచ్చే సముద్రయానానికి సిద్ధమవటం కోసమే. ప్రయాణంలో ఎదురయ్యే భిన్న విపత్కర పరిస్థితులను ఎదుర్కోగలిగిన నైపుణ్యాలు, సామర్థ్యాలు వున్నాయా? లేవా? అన్నదే కీలకం తప్ప, ఇందులో జండర్ అన్నదానికి ప్రాధాన్యమే లేదు. సముద్రానికి మీరు పురుషుడా, స్త్రీనా అన్న దానితో సంబంధమే లేదు. ఎదురైన సమస్యను ఎలా ఎదుర్కొంటావన్నదే కీలకం. నీవు ఎవరితో ప్రయాణిస్తున్నా జట్టుగా వ్యవహరించాల్సిందే. నా అదృష్టం కొద్దీ నేను ప్రయాణించిన జట్టు సభ్యులంతా సముద్ర ప్రయాణాలపట్ల మక్కువ వున్నవాళ్ళే. ప్రయాణంలో టీమ్ స్పిరిట్‌తో పనిచేసేవారే.

ప్రయాణంలో అనూహ్య సంఘటనలు ఎన్నో జరిగాయి. ఒకటి జరుగుతుందని అనుకుంటున్న సందర్భంలో మరోటి జరిగిన సందర్భాలూ వున్నాయి. ఒకరోజు సముద్రం చాలా రఫ్‌గా వుంది. అర్ధరాత్రి... హఠాత్తుగా మా నావ స్టీరింగ్ విరిగిపోయింది. అస్సలు ఊహించలేదు. అలాంటి సమయంలో గందరగోళం, ఆందోళన పనికిరాదు. మేం నేర్చుకున్న థియరీ మొత్తాన్ని గుర్తు చేసుకుంటూ ఆ సందర్భాన్ని ఎదుర్కోవటానికి వున్న అన్ని అవకాశాలను అతి వేగంగా పరిశీలించాల్సి వస్తుంది. అత్యుత్తమ పరిష్కారాన్ని హేతుబద్ధంగా ఎంచుకోవాలి. మరో ముఖ్యమైన విషయం. క్లిష్ట సమయాలలో మనం బాలెన్స్ కోల్పోకూడదు. అది పరిస్థితిని మరింత హీనం చేస్తుంది. ఇవన్నీ ప్రతి ఒక్కరికీ పుట్టుకతోనే వస్తాయని నేనేమీ అనుకోవటం లేదు. సముద్రమే అన్నీ నేర్పిస్తుంది. మేము తీసుకున్న శారీరక, మానసిక శిక్షణ మమ్మల్ని మరింత దృఢంగా చేసింది. సముద్రయానాల్లో ముందస్తు శిక్షణే అత్యంత కీలకమైనదని అనుకుంటాను.

స్త్రీ, పురుష వివక్ష పోవాలంటే సెయిలింగ్ వంటి క్రీడలను మరింత విస్తృతంగా సమాజానికి పరిచయం చేయాలి. ఈ క్రీడలో మనిషి ఆలోచనలు విస్తృతమవుతాయి. ఈ ఏడాది ఆగస్టులో మేం 'తరణి'లో ప్రపంచ పర్యటకు సిద్ధమవుతున్నాం. పనిని ఇష్టపడితే ఏదీ కష్టమైన విషయం కాదు.

● **వర్తికా జోషి, లెఫ్టినెంట్ కమాండర్**

## నిద్ర పట్టకుండా చేసేవే కలలు

'కలలంటే నా ఉద్దేశంలో నిద్ర పోయేటప్పుడు వచ్చేవి కావు... కలలంటే నీ లక్ష్యాన్ని నువ్వు చేరుకునేంతవరకూ నువ్వు నిద్రపోకుండా చేసేవి. నీ మీద నీకు నమ్మకం ఉన్నప్పుడు కలలు తప్పకుండా నెరవేరుతాయి.' ఇదే నా సిద్ధాంతం.

మా అమ్మ పేరు మాయా శుక్ల. 'జీవితంలో నువ్వు ఏమీ సాధించలేవని ఎప్పుడూ అనుకోకు. శాయశక్తులా కృషి చేయి. ఖచ్చితంగా నువ్వు అన్నింట్లో గెలుపొందుతావు' అని చెప్పేది. ఆ మాటలే నేను ఈ రోజు ఇండియన్ కోస్ట్ గార్డ్‌లో డిప్యూటీ కమాండెంట్ స్థాయిలో ఉండటానికి కారణం.

ఉత్తరప్రదేశ్‌లోని ఫతేపూర్‌లో మధ్య తరగతి కుటుంబం మాది. జీవితంలో ఏదో ఒకటి అందరికన్నా భిన్నంగా చేయాలని ఆలోచించేదాన్ని. ప్రభుత్వ పాఠశాలలో చదివి అనుకున్నట్లుగానే ఇండియన్ కోస్ట్‌గార్డ్ సర్వీస్‌లో చేరాను. నా మొదటి అపాయింట్‌మెంట్ పోర్ట్‌బ్లెయిర్‌లో వచ్చింది. అక్కడ మా రీజనల్ కమాండర్‌గా ప్రస్తుత అడిషనల్ డెరెక్టర్ జనరల్ వి.ఎస్.ఆర్ మూర్తిగారు ఉన్నారు. నా ఉద్యోగం ప్రారంభ దశలో ఆయనే నన్ను తీర్చిదిద్దారు. మా మొదటి కమాండింగ్ ఆఫీసర్ ఎస్.సోమసుందరం కూడా చాలా సాయం చేశారు. నేను సర్వీస్‌లో జాయిన్ అయిన రోజుల్లో ఆఫీసుకే పరిమితం అయ్యాను. పాలనా వ్యవహారాలు అప్పగించారు. మాతో ఉన్న మగపిల్లలంతా సముద్రంలోకి వెళ్తుంటే మాకు కూడా వెళ్లాలనిపించేది. ఆఫీసులో కూర్చోవడంకన్నా సముద్రంలోకి వెళ్లి దేశ రక్షణ కోసం నిలబడితేనే



బాగుంటుందనిపించింది. 2015 డిసెంబర్‌లో సర్వీస్ హెడ్‌క్వార్టర్ హోవర్‌క్రాఫ్ట్‌కు వాలంటీర్ కావాలని అడిగారు. ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా నా పేరు పంపాను. అప్పుడు తీసుకున్న నిర్ణయం వల్ల నేను ఇప్పుడు చాలా సంతోషంగా ఉన్నాను. మగ అధికారులకన్నా నేనేమీ తక్కువ కానని నిరూపించుకున్నాను.

ఆధిపత్య ధోరణలు ఇక్కడ మచ్చుకైనా కనిపించవు. నా కింద చాలామంది మగ ఆఫీసర్లు, సెయిలర్స్ ఉన్నారు. ఆడదాని

## ఇండియన్ కోస్ట్‌గార్డ్‌లో 'మహిళ'

**ఇండియన్** కోస్ట్‌గార్డ్‌లో విమెన్ ఆఫీసర్స్ రిక్రూట్‌మెంట్ 1997లోనే ప్రారంభమైంది. అయితే అప్పుడు కేవలం ముగ్గురు మహిళా అధికారులను మాత్రమే శాశ్వత ప్రాతిపదికన నియామకం చేశారు. అంటే కమాండెంట్ ర్యాంకులో ఉన్న వారు 57 సంవత్సరాలకు, మిగతా వారు 60 ఏళ్లకు రిటైర్ అవుతారన్నమాట. అయితే ఆ తర్వాత శాశ్వత ప్రాతిపదికన మహిళా అధికారుల నియామకాన్ని నిలిపివేసిన కేంద్ర ప్రభుత్వం కొత్తగా 2009లో షార్ట్ సర్వీస్ అపాయింటీ(ఎస్ఎస్ఏ)ని ప్రారంభించింది. ఇందులో కేవలం 8 సంవత్సరాలు మాత్రమే సర్వీస్‌లో కొనసాగుతారు. అత్యవసర పరిస్థితిల్లో మరో నాలుగేళ్ల పాటు పదవీకాలం పొడిగింపు చేసుకునే అవకాశం కూడా ఉంది. మొత్తం 12 ఏళ్ల గరిష్టంగా మహిళలు ఈ సర్వీస్‌లో ఉంటారు. దీని ద్వారా మొత్తం ఇండియన్ కోస్ట్‌గార్డ్ సర్వీస్‌లోని ఉద్యోగాల్లో 10 శాతం మహిళలకు కేటాయించారు. ఇప్పటికి 136మంది మహిళా అధికారులు ఇండియన్ కోస్ట్‌గార్డ్‌లో నియమితులయ్యారు. 2016 నుంచి హోవర్ క్రాఫ్ట్(ఎయిర్ కుషన్ వెస్సెల్)లో కూడా మహిళలకు శిక్షణ ఇస్తున్నారు. ఇప్పటికి హోవర్ క్రాఫ్ట్ ఆఫీసర్స్‌గా నలుగుర్ని నియమించారు. వ్యూహాత్మక ప్రాంతాల్లో మాత్రమే హోవర్ క్రాఫ్ట్‌లను ఉపయోగిస్తున్నారు.

మాటలు వినాల్సిన అవసరం ఏముందని ఎవరూ ఎప్పుడూ అనుకోరు. దేశ రక్షణ కోసం ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధపడినప్పుడు ఆడ, మగ తేడాలనేవి ఉండవు. అందరూ ఒక్కటే. అందరి ప్రాణాలూ ఒక్కటే.

**● అనురాధా శుక్లా, డిప్యూటీ కమాండెంట్, హోవర్ క్రాఫ్ట్**

## ప్రతీ క్షణం పరీక్షే

విస్తారమైన కోస్తా తీరాన్ని రక్షించడం అంటే సవాలుతో కూడుకున్న అంశం. ప్రతీ క్షణం పరీక్ష లాంటిదే. ఏ క్షణంలో ఏమి జరుగుతుందో తెలియదు. నిరంతరం అప్రమత్తంగా ఉండాలి. అయితే ఇది నాకు ఎంతో ఇష్టమైన వృత్తి కాబట్టి వర్క్‌ను బాగా ఎంజాయ్ చేస్తాను.

మా తాతగారు ఆర్మీలో బ్రిగేడియర్‌గా



పనిచేశారు. మా తండ్రిగారు ఆర్మీలో కల్నల్‌గా పనిచేశారు. నేను ఇండియన్ కోస్ట్‌గార్డ్‌లో డార్నియర్ పైలెట్‌గా సేవలందిస్తున్నాను. రక్షణరంగం అన్నది నా బ్లడ్‌లోనే ఉంది. కోస్ట్‌గార్డ్ శిక్షణ నాకు మొదట నేర్పింది నేను ఒక ఆఫీసర్‌ని అనే. తరువాతనే నేను యువతిని అని గుర్తు చేసింది. ఈ సర్వీస్‌లో



అలకనంద

అందరూ సమానమే. ఎక్కడా లింగవివక్షకు గురికాలేదు. అంతా ప్రొఫెషనల్‌గానే పనిచేసుకుపోతాం. 2013లో జరిగిన గణతంత్ర వేడుకల్లో భాగంగా ఇండియన్ కోస్ట్ గార్డ్ బృందానికి నేతృత్వం వహించడం నేను నా జీవితంలో మర్చిపోలేని సంఘటనగా చెప్పవచ్చు.

ఆడపిల్లలను ఏదో ఒక డిగ్రీ చదివించి, ఆ తర్వాత పెళ్లి చేయించి పంపాలనుకునే తల్లిదండ్రులకు భిన్నంగా మా తల్లిదండ్రులు ఆలోచించారు. నా భర్త బిజినెస్ మ్యాన్. బెంగళూరులో ఉంటారు. నేను చెన్నయ్‌లో ఉంటాను. నాకు మూడు సంవత్సరాల కొడుకు ఉన్నాడు. నా బిడ్డను చూస్తూ నా తల్లిదండ్రులు నాకు సాయంగా ఉంటారు. ఉద్యోగం విషయానికొస్తే విధి నిర్వహణలో మాతో ఉన్నది మగవారా? ఆడవారా? అనే ఆలోచన అస్సలు రాదు. మా పని ఏంటి? ఆ పనిని సక్రమంగా చేస్తున్నామా? లేదా? మన తోటివారు చేస్తున్నారా? చేయలేకపోతే ఎందుకు చేయలేకపోతున్నారు? వారికి ఏమైనా సాయం చేయగలమా? అన్నవే చూస్తాం. మేము ఆడపిల్లలం కాబట్టి మమ్మల్ని ఎవరూ ఏమీ అనకూడదు అంటే కుదరదు. పని అంటే పని. నేను నడిపే డార్నియర్ చాపర్‌కు తనను ఆడవారు నడుపుతున్నారా? లేక మగవారు నడుపుతున్నారా? అనే విషయం తెలియదు కదా. దానిని ఎవరు సమర్థవంతంగా నడిపితే వారి మాట వింటుంది.

**● సునీత వేణుగోపాల్, డార్నియర్ చాపర్ పైలట్**

## అనుకున్నది సాధించా

కరీంనగర్‌లో మధ్యతరగతి కుటుంబం మాది. నవోదయ విద్యాలయంలో ప్రాథమిక విద్య అభ్యసించి, అక్కడే ఎన్‌సిసిలో చేరాను. అప్పుడే డిఫెన్స్ యూనిఫాంపై నాకు మమకారం పెరిగింది. మా అన్నయ్య కూడా ఎయిర్‌ఫోర్స్‌లో పనిచేస్తున్నారు. అందుకే ఈ రంగంపై ఆసక్తి పెరిగింది. బీకాం చేసిన తర్వాత ఉస్మానియా యూనివర్శిటీలో ఎంబిఏ పూర్తి చేసి ఎయిర్‌ఫోర్స్‌తో పాటు ఇండియన్ కోస్ట్‌గార్డ్‌కు దరఖాస్తు చేసుకున్నాను. కోస్ట్‌గార్డ్‌లో అవకాశం రావడంతో వెంటనే జాయిన్ అయ్యాను. 2014లో కోస్ట్ గార్డ్ సర్వీస్‌లో చేరిన తర్వాత మొదట ఎనిమిది నెలలు కొచ్చిన్ దగ్గరున్న ఎజిమలలోని ఇండియన్ నావీ అకాడమీలో ట్రైనింగ్ ఇచ్చారు. అప్పుడే నా కాళ్లకు

## అంచనాలను మించి..

**● విఎస్ఆర్ మూర్తి, అడిషనల్ డైరెక్టర్ జనరల్, ఇండియన్ కోస్ట్‌గార్డ్**

**ఇండియన్** కోస్ట్‌గార్డ్‌లో మహిళల సామర్థ్యం అంచనాలకు మించిపోయిందని, తాము ఎందులోనూ మగవారికన్నా తక్కువ కాదన్న విషయాన్ని నిరూపించుకుంటున్నారని అడిషనల్ డైరెక్టర్ జనరల్ విఎస్ఆర్ మూర్తి తెలిపారు. ఇండియన్ కోస్ట్‌గార్డ్‌కు తొలిసారి అత్యంత ఉన్నతమైన అడిషనల్ డైరెక్టర్ జనరల్ పదవిలో నియమితులైన విఎస్ఆర్ మూర్తి 'ఆంధ్రజ్యోతి'తో మాట్లాడుతూ రాబోయే రోజుల్లో మరింత మంది మహిళలకు కోస్ట్‌గార్డ్ సర్వీస్‌లో అవకాశం కలిగించనున్నట్లు తెలిపారు. ప్రస్తుతం పెద్ద షిప్‌లలో మహిళలకు ప్రత్యేకమైన వసతులు లేనందున వారిని వాటిల్లో నియమించడం లేదని, కొత్తగా తయారవుతున్న షిప్‌లలో మహిళలకు కూడా ప్రత్యేకమైన క్యాబిన్‌లు ఏర్పాటు చేసి, వారికి కావాల్సిన వసతులను ఏర్పాటు చేస్తున్నామని, భవిష్యత్తులో వారి సేవలు మరిన్ని విభాగాలకు విస్తరిస్తాయని తెలిపారు. 2016 నుంచి హోవర్ క్రాఫ్ట్‌లపై మహిళలకు శిక్షణ ఇస్తున్నామని, పొరుగు దేశాలకు చెందిన స్మగ్లర్లు లేదా జాలర్లు భారతదేశ మత్స్యసంపదను కొల్లగొట్టేందుకు చేసే ప్రయత్నాలను నిరోధించడంలో హోవర్ క్రాఫ్ట్‌లు బాగా పనిచేస్తాయని అన్నారు. సముద్రంపైకి గస్తీకి ప్రత్యేకంగా ఆల్ ఉమెన్ క్రూతో ఉన్న డార్నియర్ క్రాఫ్ట్‌లను పంపుతున్నామని తెలిపారు.






గాయాలయ్యాయి. మూడు నెలలు హాస్పిటల్‌లో చికిత్స పొందాను. అదే సమయంలో మా నాన్నకు పక్షవాతం వచ్చింది. అయినా నేను డిస్ట్రబ్ అవుతానని ఆ విషయాన్ని నాకు చెప్పలేదు. ట్రైనింగ్ పూర్తి అయిన తరవాతే నాకు ఆ విషయాన్ని మా కుటుంబ సభ్యులు తెలియజేశారు. ప్రస్తుతం గాంధీనగర్ (గుజరాత్)లో లోగో(లాజిస్టిక్ ఆఫీసర్)గా పనిచేస్తున్నాను. లాజిస్టిక్ ఆఫీసర్‌గా పదవీ బాధ్యతలు చేపట్టిన తర్వాత కోస్ట్‌గార్డ్‌లోని ప్రతి అంశంపైనా అవగాహన రావడం కోసం సిగ్నలింగ్ వ్యవస్థతో పాటు ఎలక్ట్రికల్, లా కోర్సులను కూడా చేశాను.

విధుల్లో భాగంగా షిప్‌లో ప్రయాణం, సాహసంతో కూడుకున్న వాటర్ స్పోర్ట్స్, వివిధ రకాలైన బోట్‌లను నడపడం, సముద్రాలలో ఈత కొట్టడం... ఇలాంటివన్నీ నాకు మర్చిపోలేని అనుభూతే. ఉత్తరాఖండ్‌లోని రూప్‌కుండ్‌కు వెళ్లిన ట్రెక్కింగ్ కూడా నా జీవితంలో మర్చిపోలేను. 16,499 అడుగుల ఎత్తులో ట్రెక్కింగ్ ఎంతో సాహసంతో కూడుకున్నదేనని చెప్పాలి. మనం కష్టాలను చూసి భయపడితే అవి మనల్ని మరింత భయపెడతాయి. తిరగబడితే తోక ముడుస్తాయనేది సముద్రం, ఉద్యోగం నాకు నేర్పిన జీవితపాఠం.

**● అలకనంద, లాజిస్టిక్ ఆఫీసర్**

## అమ్మ కల నెరవేర్చాను

నేను 9వ తరగతి చదువుతున్నప్పుడు మా స్కూలులో కెరీర్ కౌన్సిలింగ్ సెషన్ జరిగింది. మా క్లాస్‌లో ఎంతమంది డిఫెన్స్ ఫోర్స్‌లో చేరతారని అడిగారు. అప్పుడు చాలా కొద్ది మంది మాత్రమే లేచి నిలబడ్డారు. ఆ కొద్ది మందిలో నేనొక్కదాన్నే ఆడపిల్లను. డిఫెన్స్ యూనిఫాం పట్ల ప్రేమ నాకు చిన్నప్పటినుంచే ఉంది. దేశానికి సేవ చేయాలన్న సంకల్పంతోనే ఏరికోరి ఇండియన్ కోస్ట్‌గార్డ్‌లో చేరాను. మా కుటుంబంలో ఎవరూ డిఫెన్స్ రంగంలో లేరు. ఫరీదాబాద్‌లో మాది ఉమ్మడి కుటుంబం. ఆడపిల్లలు డిఫెన్స్‌లో చేరుతారంటే ఆశ్చర్యంగా చూసే మా ఊరివాళ్లు ఎప్పుడూ నన్ను 'జీవితంలో ఏమవుతావు' అని అడిగేవారు. 'ఇప్పుడే ఎందుకు చెప్పడం నేను ఏదో ఒకటి అయిన తరువాత మీకే తెలుస్తుందిగా' అని సమాధానం చెప్పేదాన్ని. అన్నట్టుగానే డిఫెన్స్‌లో చేరి అందర్నీ ఆశ్చర్యపరిచాను. నిజానికి నన్ను రక్షణరంగం యూనిఫామ్‌లో చూడాలనేది మా అమ్మ కల.

ఒకప్పుడు డిఫెన్స్‌లో మగవారే ఎక్కువగా ఉన్నా ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. రక్షణరంగంలో కూడా మహిళలు ఉన్నత పదవులను అధిరోహిస్తున్నారు. ఇండియన్ కోస్ట్‌గార్డ్‌లో మహిళలు కేవలం పరిపాలనా సంబంధమైన పనుల్లోనే కాకుండా లాజిస్టిక్‌లోనూ, హోవర్‌క్రాఫ్ట్‌లలో ప్రయాణం చేస్తున్నారు. అంతేకాకుండా డార్నియర్, చేతక్‌లలో పైలట్‌లుగానూ, ఎయిర్ ట్రాఫిక్ కంట్రోలర్స్‌గా, మెట్స్‌గా, ఎంఇటి ఆఫీసర్స్‌గా, అబ్జర్వర్స్‌గా కూడా పనిచేస్తున్నారు. ఈ రంగంలో ఆడవారికి కూడా అన్ని బాధ్యతలను అప్పగిస్తున్నారంటే మేము మా సత్తా నిరూపించుకోబట్టే కదా. మగవారిపైన ఉన్న విశ్వాసాన్ని మా ఆర్గనైజేషన్ ఆడవారిపైన కూడా ఉంచుతోంది. ఇది చాలా ఆనందించాల్సిన విషయం.

ఫిజికల్ ట్రైనింగ్ తర్వాత తొలిసారిగా రైఫిల్‌ను పట్టుకొని టార్గెట్‌పై ఫైరింగ్ చేయడం, కత్తి చేతబూని పెరేడ్‌లో కమాండ్స్ ఇవ్వడం నా జీవితంలో మర్చిపోలేని విషయాలనే చెప్పాలి. ట్రైనింగ్ సమయంలో 110 మంది యువకులతో కూడుకున్న బృందానికి నేను ఒక్కదాన్నే కమాండింగ్ ఆఫీసర్‌గా ఉండటం అంటే మామూలు విషయం కాదు. డైరెక్టర్ జనరల్ రాజేంద్రసింగ్‌కు 'గార్డ్ ఆఫ్ ఆనర్' ఇవ్వడం కూడా మర్చిపోలేని అనుభూతినిచ్చింది. కశ్మీర్ లోయలో ట్రెక్కింగ్, గుల్‌మార్గ్‌లో స్కైయింగ్, పిండరీ గ్లేసియర్‌లో మహిళా సదస్సులో పాల్గొనడం, 2012లో కొచ్చిలో సెయిలింగ్ కప్‌ను గెల్చుకోవడం నా జీవితంలో మర్చిపోలేని మరికొన్ని మధురమైన అనుభూతుల్ని మిగిల్చాయి. జీవితంలో ఏదైనా సాధించాలంటే సాహసం చేయాల్సిందే. ఇదే నా ఫిలాసఫీ.

**● సోనియాసింగ్,**
**పరిపాలనా విభాగం అధికారి**

ఫోటో కర్టెసీ: **ఇండియన్ నేవీ, కోస్ట్ గార్డ్**



anand sai

# జీయర్ స్వామి నా జీవనపథాన్ని మార్చారు...

**తెలుగు** సినీరంగంలో కళాదర్శకత్వానికి ఒక విశేషగుర్తింపు తీసుకొచ్చినవారిలో ఆనందసాయి ఒకరు. 'తొలిప్రేమ'లో సముద్రతీరంలో వేసిన తాజ్‌మహల్ సెట్‌తో ప్రారంభమైన ఆయన హవా 'ఎవడు'దాకా నిరంతరాయంగా కొనసాగింది. 'సైనికుడు', 'బద్రీనాథ్', 'యమదొంగ', 'శక్తి' వంటి ఎన్నో సినిమాలకు భారీగా, భిన్నంగా సెట్లు వేసిన **ఆనందసాయి** తాజాగా 'యాదాద్రి' ప్రాజెక్టు రూపకర్తగా వార్తల్లోకి వచ్చారు. తెలంగాణ ప్రభుత్వం అత్యంత ప్రతిష్టాత్మకంగా తీసుకున్న ఈ భారీ ప్రాజెక్టు కోసం ప్రస్తుతం సాయి అహర్నిశలు కష్టపడుతున్నారు. 'ఈ మార్పుకు కారణం చినజీయర్ స్వామి. ఆయన నా జీవనపథాన్నే మార్చారు. ఆయన పరిచయం యాంత్రిక జీవనంలో కొట్టుకుపోతున్న నాకో గమ్యాన్ని చూపింద" అంటూ ఆనందసాయి చెప్పిన విశేషాలివి...

**మా** నాన్న బి.చలం సుప్రసిద్ధ కళా దర్శకుడు. బ్లాక్ అండ్ వైట్ సినిమాల నుంచి 'జగదేకవీరుడు అతిలోకసుందరి', 'గోవిందా గోవిందా' దాకా సుమారు 700 సినిమాలకు ఆర్ట్ డైరెక్టర్‌గా పనిచేశారు. అయితే నాకు మాత్రం ఆర్ట్ అంటే అస్సలు ఇష్టం ఉండేది కాదు. మాది విజయనగరం జిల్లా పర్లాకిమిడి అయినప్పటికీ నేను



పుట్టిపెరిగిందంతా చెన్నైలోనే. అక్కడి రామకృష్ణా మిషనరీ స్కూల్లో చదువుకున్నా. మా నాన్నగారు మా అన్నదమ్ములిద్దర్నీ మొదటి నుంచీ మనసుకు నచ్చిన పని చేయమని ఎంకరేజ్ చేసేవారు. దాంతో డిగ్రీ పూర్తయ్యాక ఉద్యోగ ప్రయత్నాలు చేశాను. రకరకాల ఉద్యోగాల తర్వాత క్రెడిట్ కార్డుల సేల్స్ ఎగ్జిక్యూటివ్‌గా చేరాను. చెన్నైలో మా ఇంటికి వెళ్తున్న దారిలోనే సంగీత దర్శకుడు చక్రవర్తిగారి ఇల్లుండేది. అయితే ఆయన తెలుగులో పెద్ద మ్యూజిక్ డైరెక్టరనే విషయం నాకు అప్పటికి తెలియదు. ఎలాగైనా ఒక క్రెడిట్ కార్డు అమ్మాలనే ఉద్దేశ్యంతో ఆయన ఇంటికి తరచూ వెళ్లేవాణ్ణి. వెళ్లిన ప్రతీసారి 'ఇవ్వాళరా.. రేపు రా...' అని తిప్పి పంపేవారు. ఒకరోజు నన్ను పిలిచి స్వీట్ తీసుకోమన్నారు. నేను 'ఎందుకు సార్... ' అంటే ఆ రోజు తన పుట్టినరోజని చెప్పారు. ఆ సందర్భంగా ఒక మాటన్నారు. "సక్సెస్ ఉన్నంతవరకే సినిమా ఇండస్ట్రీ నీ వెనుక పడుతుంది. లేదంటే ఎవరూ నీవైపు కన్నెత్తి కూడా చూడరు. ఒకప్పుడు నా పుట్టినరోజునాడు మా ఇంటిముందు అందరూ క్యూ కట్టేవారు. ఇప్పుడు చూడు ఎవరూ లేరు" అన్నారు. ఆ మాటలు ఎందుకో నా మనసులో బలంగా నాటుకుపోయాయి.

## ఇష్టం లేకుండానే ఇండస్ట్రీలోకి...

ఒకరోజు మా ఫాదర్‌ను రిసీవ్ చేసుకునేందుకు రైల్వేస్టేషన్‌కు వెళ్లాను. పవన్‌కళ్యాణ్ కూడా వాళ్ల అన్నయ్య చిరంజీవిగారిని రిసీవ్ చేసుకోవడానికి అక్కడికి వచ్చారు. దత్తు అనే కామన్‌ఫ్రెండ్ ద్వారా పవన్‌కళ్యాణ్ నాకు పరిచయమయ్యారు. ఆ తర్వాత కళ్యాణ్, నేను క్లోజ్‌ఫ్రెండ్స్ అయ్యాం. చెన్నై అంతా బైక్ మీద తిరిగేవాళ్లం. ఒకసారి బీచ్‌లో తిరుగుతుంటే 'ఇక్కడ తాజ్‌మహల్ సెట్ వేస్తే బాగుంటుంద'ని ఊరికే అన్నాను. ఆ తర్వాత కొన్నాళ్లకు కళ్యాణ్ తను సినిమాల్లో నటించేందుకు హైదరాబాద్‌కు వెళ్తున్నానన్నారు. నన్ను కూడా రమ్మని బలవంతపెట్టారు కానీ నేను దాన్ని

సీరియస్‌గా తీసుకోలేదు. నాన్నలాగా నన్ను కూడా ఆర్ట్ డైరెక్టర్ అవ్వమని ఎప్పుడూ అంటుండేవారు కళ్యాణ్. అతడి బలవంతం మీదే 'గోకులంలో సీత'కు ఆర్ట్ డైరెక్టర్‌గా పనిచేసేందుకు ఒప్పుకున్నాను. ఆ రోజే నా జీవితంలో మొదటిసారిగా మా నాన్నగారు వేసిన స్కెచ్‌లను, సెట్ డిజైన్లను జాగ్రత్తగా పరిశీలించాను. ఏవో కొన్ని స్కెచ్‌లు గీసి అయిష్టంగానే 'గోకులంలో సీత' సినిమాకు పనిచేసి ఆ తర్వాత చెన్నైకి వెళ్లిపోయా. అయితే 'తొలిప్రేమ'కు కూడా కళ్యాణ్ నన్నే రికమెండ్ చేశారు. దర్శకుడు కరుణాకరన్ ఆ సినిమాకు తోటతరణిలాంటి సీనియర్‌ను ఆర్ట్ డైరెక్టర్‌గా పెట్టుకోవాలనుకున్నా కళ్యాణ్ మాత్రం నన్నే ఎంచుకున్నారు.

నేను సరదాగా ఒకప్పుడు అన్న 'ఇసుక తిన్నెలపై తాజ్‌మహల్'ను సినిమాలో ఒక పాటకోసం సిట్యుయేషన్‌తో సంబంధం లేకున్నా వేయమన్నారు కళ్యాణ్. 'తొలిప్రేమ' సూపర్‌హిట్ అయ్యింది. దాంతో పాటు ఆ సెట్ కూడా చాలా పాపులరయ్యింది. ఆ తర్వాత సినిమారంగంలో 'ఖరీదైన' ఆర్ట్ డైరెక్టర్‌గా పేరు తెచ్చుకున్నాను.

## పెళ్లిళ్లకు 'భారీ' సెట్లు...

నేను సినిమాలకు పరిమితం కాకుండా పెళ్లిళ్లకు కూడా భారీ సెట్లు వేయడానికి చిరంజీవిగారు కారణం. చిరంజీవిగారి కూతురు పెళ్లికి తొలిసారిగా భారీ పెళ్లిమంటపం సెట్ వేశాను. అది అందరికీ నచ్చడంతో ఆ తర్వాత రామ్‌చరణ్, జూనియర్ ఎన్టీఆర్, అల్లు అర్జున్, 'మైహోమ్' రామేశ్వరరావుగారిళ్లలో పెళ్లిళ్లకు సెట్లు వేశాను. పెళ్లి వేడుకల్లో పవిత్రత కనిపించాలి కాబట్టి భారీ మంటపాలు, దేవుళ్ల శిల్పాలు, ఏనుగులు, గుర్రాలు... ఇలా ఆ వేదికను అద్భుతంగా తీర్చిదిద్దేవాణ్ణి. మైహోమ్ రామేశ్వరరావుగారి ఇంట్లో పెళ్లిళ్లకు చినజీయర్‌స్వామిగారొచ్చేవారు. ఆయనకు ఆ వివాహ వేదికలు బాగా నచ్చాయి. సరిగ్గా ఆ టైమ్‌లో నేను 'ఎవడు' సినిమాకు ఆర్ట్ డైరెక్టర్‌గా పని చేస్తున్నాను. అప్పటికే కెరీర్ గురించి కొంత డైలమాలో ఉన్నాను. 'సినిమాల్లో ఇక చాలు' అనే భావన అప్పుడప్పుడే నాలో మొదలవుతోంది. చెన్నైకి తిరిగివెళ్దామా అని కూడా అనుకుంటున్నాను. ఒకప్పుడు చక్రవర్తిగారన్న మాటలు కూడా గుర్తుకొచ్చాయి. అలాంటి సమయంలో జీయర్‌స్వామిని కలవడంతో ఇక నేను వెళ్లాల్సిన దారి స్పష్టంగా కనిపించింది.

## ఆ ఒక్క మాటతో సినిమాలు వదిలేశాను...

రామేశ్వరరావుగారి తమ్ముడు జగపతిరావుగారు నాకు బాగా పరిచయం. శంషాబాద్‌లోని జీయర్ స్వామి ఆశ్రమంలో 108 అడుగుల రామానుజాచార్యుల విగ్రహం ఏర్పాటు చేస్తున్నారని, అక్కడ టెంపుల్ ఎలివేషన్ పని చేయాల్సి ఉందని నన్ను తీసుకెళ్లారు. స్వామిగారి ఆశ్రమంలో అప్పటికే ఒక బిల్డింగ్ ఉంది. అది నా డ్రాయింగ్స్‌కు



నాకు ముందు నుంచి 'థింక్ బిగ్' అలవాటైంది. దేన్నయినా లార్జ్‌స్కేల్‌లో ఊహిస్తాను. అందుకే ఏ సెట్‌నైనా ఆ రేంజ్‌లో ఊహించి వేసేవాణ్ణి. నా డ్రీమ్స్ అన్నీ సినిమాల్లో తీర్చుకున్నాను. ఆర్ట్ మీద బుక్స్ ఎక్కువగా చదువుతాను. నా దగ్గర పదివేలకు పైగా ఆర్ట్‌కు సంబంధించిన పుస్తకాలున్నాయి. ఏదైనా రెఫరెన్స్ కావాలంటే నేను గూగుల్ కన్నా పుస్తకాలనే ఎక్కువగా ఫాలో అవుతుంటాను.

మ్యాచ్ కావడం లేదు. అదే విషయం అక్కడివారితో చెప్పాను. ఏం చేద్దామని వారు అడిగారు. అక్కడే ఒక గంటలో చకచకా కొన్ని డ్రాయింగ్స్ వేశాను. అవి స్వామిగారికి బాగా నచ్చి నన్నే ఆ ప్రాజెక్టు డిజైన్ చేయమని అన్నారు. 'ఇది టెంపుల్ పని కాబట్టి ఎంతకాలం పడుతుందో తెలియదు. అందుకోసం నువ్వు సినిమాలు మానెయ్యాల్సి ఉంటుంది ఆలోచించుకో' అని రామేశ్వరరావుగారు చెప్పారు. ఇంటికి వెళ్లి మా ఆవిడ (వాసుకి)తో చర్చించాను. 'నీ మనసుకు నచ్చిందే చేయమ'ని ప్రోత్సహించింది. అక్కడి నుంచి నా లైఫ్‌స్టయిల్ మొత్తం


ఆనందసాయి వేసిన యాదాద్రి స్కెచ్

మారిపోయింది. పూర్తి శాకాహారిగా మారిపోయాను. సినిమా సంబంధాలు తెంపుకున్నాను. హైఫై లైఫ్‌ను వదులుకుని సాధారణ జీవితానికి, ఆధ్యాత్మికతకు అలవాటుపడ్డాను.

జీయర్‌స్వామి ఇచ్చిన ఒక రికమండేషన్ పత్రంతో దేశంలోని అన్ని వైష్ణవ గుళ్లకీ వెళ్లాను. అనేకమంది స్థపతులను కూడా కలిశాను. అందరూ ఆయా గుళ్లను కట్టించిన మహారాజుల పేర్లు చెబుతారుగానీ వాటిని అంత అద్భుతంగా చెక్కిన స్థపతుల గురించి ఎవరికీ తెలియదు. గణపతి స్థపతి, ముత్తయ్య స్థపతి, ఒరిస్సాలోని మహరాజు పాత్రో స్థపతి... ఇలా కొంతమంది పేర్లు మాత్రమే తెలిశాయి. గణపతి స్థపతి చివరి రోజుల్లో ఆయన ఆశీస్సులు తీసుకున్నాను. ఆయన తమ్ముడు ముత్తయ్య స్థపతిని చెన్నైలో కలిశాను. సాధారణంగా ఆయన ఎవరినీ కలవరు. చాలాసార్లు తిరిగిన తర్వాత చివరికి రమ్మన్నారు. నేను వెళ్లేసరికి ఆయన ఎవరికో ఒక గుడి కోసం గోపురం స్కెచ్ వేస్తున్నారు. ఆయనకు కాస్త దూరంగా కూర్చుని నేను కూడా ఒక గోపురం స్కెచ్ వేశాను. ఆయన అది చూసి మీరు విశ్వకర్మలా అన్నారు. గుళ్ల కేవలం విశ్వకర్మలు మాత్రమే కడతారని చెప్పారు. నాకా విషయం అప్పటిదాకా తెలియదు. అంటే నాకు తెలియకుండానే నేను గుళ్ల కట్టేందుకు కనెక్ట్ అయ్యానన్నమాట. ఆ క్షణంలో దైవ నిర్ణయమంటే ఇదేనేమో అనిపించింది.

## 'యాదాద్రి'... ఒక అద్భుతం...

నేను షిర్డీసాయితోపాటు నరసింహస్వామి భక్తుణ్ణి కూడా. కేసీఆర్‌గారు ముఖ్యమంత్రి అయిన తర్వాత యాదాద్రిని అభివృద్ధి చేస్తున్నారని తెలిసి కొన్ని స్కెచ్‌లు వేసుకుని జీయర్‌స్వామిని కలిశాను. 'బాగున్నాయి... నీ ప్రయత్నం నువ్వు చెయ్యమ'ని అన్నారు. దేశవ్యాప్తంగా వచ్చిన స్కెచ్‌లలో సీఎంగారికి నా స్కెచ్‌లు బాగా నచ్చాయి. ఆ ప్రాజెక్టు నాకు అప్పజెప్పారు. అప్పటినుంచి యాదాద్రి పనిలోనే ఉన్నాను. నా పిల్లలపై ప్రమాణం చేసుకుని మరీ ఎంతో నిష్ఠగా, నిజాయితీగా నా సర్వశక్తులు ఒడ్డి ఈ పని చేస్తున్నాను. ఇప్పటిదాకా ప్రపంచంలో రాతి గోపురం ఉన్నది ఒక్క తంజావూరులోనే. దాన్ని కట్టి కొన్ని శతాబ్దాలు అవుతోంది. ఆ తర్వాత అంతటి కీర్తి యాదాద్రికే దక్కుతుంది. ప్రభుత్వం తరపున స్థపతులైన సౌందర్యరాజన్, వేలుగార్లతో కలిసి నేను ఈ బృహత్ కార్యక్రమాన్ని తలకెత్తుకున్నాను. సుమారు 15 ఎకరాల విస్తీర్ణంలో యాదాద్రి అద్భుతంగా రూపుదిద్దుకుంటోంది. గుడి బయట ఉండే ప్రాకారాల్లో చుట్టూ మండపాలుంటాయి. గుడి బయట ఒక పెద్ద నిరీక్షణా మందిరం ఉంటుంది. దేశంలో ఇదే మొదటిది.

గుట్టపైన దక్షిణ దిశగా పంచలోహాలతో 108 అడుగుల ఆంజనేయస్వామి విగ్రహం ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తుంది. బస్టాండ్ నుంచి గుడికి వెళ్లేదారిలో ఒక గుహను డిజైన్ చేశాను. గుడికి వచ్చిన వారు అద్భుత అనుభవాన్ని పొందాలనే ముఖ్యమంత్రిగారి కలకు ఒక స్థపతిగా నేను రూపం ఇచ్చానని అనుకుంటున్నా. ఈ జన్మకు ఇది చాలు. రాబోయే దసరాకు యాదాద్రిని భక్తులకు అందుబాటులోకి తేవాలని ప్రయత్నిస్తున్నాం. యాదాద్రి ప్రాజెక్టు జరుగుతున్నప్పుడే ఢిల్లీ అక్షరధామ్‌లాంటి ఒక ప్రాజెక్టుకు... ఒరిస్సాలోని పూరీలో... ఆఫర్ వచ్చింది. నేను కలిసిన అనేకమంది స్థపతుల స్కెచ్‌లు చూసిన తర్వాత ఈ రంగంలో నేను సాధించాల్సింది ఇంకా చాలా ఉందనిపించింది. ప్రస్తుతం ఆ దిశలోనే అడుగులు వేస్తున్నాను.

● చల్లా శ్రీనివాస్

# cyber క్రైమ్

# డేటింగ్ కిలాడీ

**"హాయ్..."**
**"హాయ్ సునీల్... హౌఆర్యూ..."**
**"ఫైన్... థాంక్యూ... నిన్న మీరు అప్‌డేట్ చేసిన ఫోటో బాగుంది. యువర్ లిప్స్ ఆర్ సో సెక్సీ..."**
**"రియల్లీ... యూ నాటీ..."**

డేటింగ్ యాప్‌లో చాటింగ్ రొమాంటిగ్గా సాగుతూనే ఉంది. అలకలు, చిలక పలుకులు, కోపాలు, తాపాలు... అప్పుడప్పుడు సెక్సీ కామెంట్స్... సునీల్‌కు యమా ఎగ్జయిటింగ్‌గా ఉంది.

డేటింగ్ యాప్స్‌లో తరచూ అందమైన అమ్మాయిల ఫొటోల్ని చూసే సునీల్‌కు ఈ కొత్త అమ్మాయి వారం క్రితం పరిచయమైంది. తొలిసారి ఆ అమ్మాయి ప్రొఫైల్ పిక్ చూడగానే ఆమె అందానికి ఫిదా అయ్యాడు. వయస్సు పాతిక లోపే. హైదరాబాద్‌లోనే అందుబాటులో ఉంటానంది. ఇంకేం ... హాయ్... హలో పలకరింపుల నుంచి ఆన్‌లైన్ ముద్దుల వరకు వెళ్లింది వ్యవహారం. ప్రతీ రోజూ ఆన్‌లైన్‌లోనే బోల్డన్ని కవ్వింపులు, కబుర్లు దొర్లిపోతున్నాయి.

ఒకరోజు...

"రేయ్... చిన్న హెల్ప్ కావాల్రా..."

"ఏమిటో చెప్పు బంగారం..."

"నా ఫేవరెట్ స్టార్ కొత్త సినిమా వచ్చింది. టికెట్లు దొరకడం లేదు..."

"అయితే మనిద్దరం వెళ్దామంటావా...?"

"అది కాదురా... నేను నా ఫ్రెండ్స్‌తో వెళ్తున్నా..."

"ఓకే..."

"కోపమొచ్చిందా..."

"అదేం లేదులే కానీ విషయమేంటో చెప్పు బంగారం..."

"నా డెబిట్ కార్డు పిన్ బ్లాక్ అయ్యింది. అందుకే అర్జెంటుగా నాలుగు టికెట్లు ఆన్‌లైన్‌లో బుక్‌చేసి, నాకు ఎస్సెమ్మెస్ చేయవా?"

"అలాగే డార్లింగ్..."

"థాంక్యూ రా... లవ్ యూ...' అంటూ ఒక కిస్ సింబల్ పోస్ట్ చేసింది.

అది చూసిన మరుక్షణమే ఆన్‌లైన్‌లో నాలుగు టికెట్లు బుక్ చేసి ఆ వివరాలను ఎస్సెమ్మెస్ చేశాడు సునీల్.

•••

"సార్ నా పేరు సునీల్... ఒక ఎంఎన్‌సీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నాను. ప్లీజ్... నా పేరు బయటకు రాకుండా సాయం చేయండి" అంటూ సైబర్ క్రైమ్ పోలీసులను బతిమిలాడటం మొదలెట్టాడు సునీల్.

"అసలేం జరిగిందో చెప్పండి... ఎందుకింత కంగారుపడుతున్నారు?" అంటూ సైబర్ క్రైమ్ ఇన్‌స్పెక్టర్ రియాజ్ ప్రశ్నించడంతో ఒక్కసారి బరస్ట్ అయ్యాడు సునీల్.

సునీల్ ఏడుస్తూ చెప్పిన విషయాలు సావధానంగా విన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఓకే... ఓకే... మీరు కంగారుపడొద్దు. ఇంకా టైముంది కదా... " అంటూ సునీల్‌ను సముదాయిస్తూ అతడికి వచ్చిన ఎస్సెమ్మెస్‌ను పరిశీలించాడు.

సునీల్ భార్య, చెల్లెళ్ల ఫోటోలను డేటింగ్ యాప్‌లో ఉంచి, అతడి ఫోన్ నెంబర్ కూడా పోస్ట్ చేస్తామని, అడిగిన డబ్బు ఇవ్వకపోతే రెండు గంటల్లో ఆన్‌లైన్‌లో ఫోటోలు ప్రత్యక్షమవుతాయని ఆ ఎస్సెమ్మెస్ సారాంశం. టెక్స్ట్ కింద అసభ్యంగా మార్ఫింగ్ చేసిన అతని భార్య ఫోటోను పంపారు.

"ఇంతకీ ఈ ఫోన్ నెంబర్ ఎవరిది?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ రియాజ్.

"తెలియదు సార్... ఆ ఫోన్ నుంచే బెదిరింపు కాల్స్ కూడా వస్తున్నాయి..." అంటూ వెక్కి వెక్కి ఏడ్చాడు సునీల్.

"డబ్బు అందలేదని చెప్పి ఇంకా రెండు గంటలు టైమ్ అడుగు... మిగతా విషయాలు మేం చూసుకుంటాం" అంటూ రియాజ్ వెంటనే రంగంలోకి దిగాడు.



•••

ఫోన్ మోగింది.

భయం భయంగానే సునీల్ ఫోన్ ఎత్తి "హలో..." అన్నాడు.

"మూడు లక్షల రూపాయలడిగితే ఖాతాలో లక్ష రూపాయలే డిపాజిట్ చేశావు. నక్రాల్ చేస్తున్నావా? ఆ ఫోటోలను ఇప్పుడే అప్‌లోడ్ చేస్తున్నాం..."

"అది కాదు... " అని సునీల్ మాట్లాడుతుండగానే ఫోన్ కట్టయ్యింది.

'దేవుడా... అనవసరంగా ఇరుక్కుపోయాను...' అనుకుంటూ తలపట్టుకున్నాడు సునీల్.

•••

కంప్యూటర్ కీ బోర్డుపై రియాజ్ వేళ్ల పరుగులు తీస్తున్నాయి. ఐపీ నెంబర్ల వడపోత ప్రారంభమైంది. మరోవైపు టెలికాం టవర్ లొకేషన్ల సెర్చ్ సత్ఫలితం ఇచ్చింది. కొద్దిసేపటికే రియాజ్ అన్వేషణ ఫలించింది. సునీల్‌కు ఫోన్ చేసిన నెంబర్ ట్రేస్ అయ్యింది. వెంటనే వనస్థలిపురం ఇన్‌స్పెక్టర్ వెంకటరెడ్డికి ఫోన్ చేశాడు రియాజ్. ఒక చిరునామా ఇచ్చి అక్కడున్న వారిని అదుపులోకి తీసుకొమ్మని సూచించాడు.

•••

సైబర్‌క్రైమ్ పోలీస్‌స్టేషన్...

కమిషనర్ సందీప్ శాండిల్య ఎదురుగా ఒకమ్మాయి కూర్చుని ఉంది. ఆమె గురించిన వివరాలు చెబుతున్నాడు ఇన్‌స్పెక్టర్ రియాజ్.

"సార్. ఈమె పేరు భట్టు రాజేశ్వరి... డేటింగ్ యాప్‌లో క్యూటీ 27 ఐడీ ఏర్పాటుచేసుకుని యువకులను చాటింగ్ ముగ్గులోకి దింపుతుంది. ఆ తర్వాత వారికి ఏ మాత్రం డౌటు రాకుండా వారి పేరు, మొబైల్ నెంబర్లను సంపాదిస్తుంది. సినిమా టికెట్ల మిషతో సునీల్ ఫోన్ నెంబర్ సంపాదించినట్టుగా. దాని ఆధారంగా సోషల్ మీడియాలో సెర్చ్ చేసి వారి ఫ్యామిలీ ఫోటోలను డౌన్‌లోడ్ చేసి, వాటిని అసభ్యంగా మార్ఫింగ్ చేసి ఆ తర్వాత వాటిని ఆన్‌లైన్లో పెడతామని బెదిరించి డబ్బు డిమాండ్ చేస్తుంది"

"సునీలే కాకుండా ఇంకా ఎవరైనా బాధితులున్నారా...?"

"సాధారణంగా ఇలాంటి కేసుల్లో బాధితులు తమ పరువు పోతుందని బయటికి రావడం లేదు. సునీల్ ఫిర్యాదు చేయడంతో మా టీమ్ రంగంలోకి దిగి ఆమె ఐపీ అడ్రస్ కనుక్కుంది. రాజేశ్వరి ఉపయోగిస్తున్న సెల్‌ఫోన్ల ఆధారంగా ఆమె ఉంటున్న లొకేషన్‌ను కనుక్కొని అరెస్ట్ చేశాం. డేటింగ్ యాప్‌లో పెట్టిన సునీల్ కుటుంబసభ్యుల ఫోటోలు కూడా డిలీట్ చేయించాం. ఇప్పటికే రాజేశ్వరి చాలామందిని మోసం చేసిందని విచారణలో వెల్లడైంది. చాలామంది ఆమెకు భయపడి అడిగినంత డబ్బు ఇచ్చారు..." అంటూ అన్ని వివరాలను కమిషనర్‌కు వెల్లడించాడు ఇన్‌స్పెక్టర్ రియాజ్.

డేటింగ్ సైట్లలో మజా చేద్దామనుకుని స్వంత వివరాలను వారికి తెలియచేస్తే ఇలాగే జరుగుతుంది. కేవలం సునీల్ ఫోన్‌నెంబర్ ఆధారంగా మొత్తం అతని కుటుంబసభ్యుల వివరాలను రాజేశ్వరి సేకరించిందంటే ఆమె ఎంత కిలాడో అర్థమవుతుంది. అలాంటి కిలాడీ లేడీలు ఆన్‌లైన్‌లో కోకొల్లలుగా ఉన్నారు. బీ కేర్‌ఫుల్.

**- వేముల సత్యనారాయణ,**
**99854 88800**

దైవమ్





# బుద్ధుని పన్ను చూస్తారా?

**సింగపూర్ వెళ్లాము అంటే, సెన్‌టోశా చూశావా అని అడుగుతారు, ఫ్లయ్యర్ ఎక్కావా అని ఆరా తీస్తారు. జూ చూశావా, యూనివర్సల్ స్టూడియోస్?, నైట్ సఫారీ?, క్యార్కీ క్వేలో నైట్ లైఫ్? ఇట్లా సాగుతాయి ప్రశ్నలు. కానీ, నేషనల్ మ్యూజియం చూశావా, బుద్ధిస్ట్ టెంపుల్స్ చూశావా అని ఎవరో తప్ప అడగరు. సింగపూర్‌లో బుద్ధుడి గుడులు చాలానే ఉన్నాయి. వాటిలో బుద్ధుని దంతం ఉన్న ఒక అద్భుతమైన ఆలయం ఉంది.**

చైనా టౌన్‌లో ఉంటుంది బుద్ధుని దంత ధాతు ఆలయం. దీని నిర్మాణం జరిగి ఇంకా పదేళ్లు కూడా పూర్తి కాలేదు కాబట్టి, టూరిస్టు పటంలో అది ఇంకా ప్రముఖంగా చోటుచేసుకోలేదు. కానీ, బౌద్ధులు, బౌద్ధం మీద ఆసక్తి ఉన్న పాశ్చాత్యులు పెద్దసంఖ్యలో ఈ ఆలయాన్ని దర్శిస్తారు. మయన్మార్‌లోని బందుల బౌద్ధ మఠం పెద్ద అయిన చక్కపాలకు దొరికిన ధాతువు అది.

2007 మే 30 నాడు సింగపూర్ అధ్యక్షుడు నాథన్ చేతుల మీదుగా ఈ గుడి తలుపులు తెరుచుకున్నాయి. ఈ గుడిలో మహాయాన, హీనయాన, వజ్రయాన మార్గాలకు చెందిన పద్ధతులను మేళవించారు. అయితే ప్రధానంగా ఆలయం మహాయాన పద్ధతికి చెందినది. గౌతముని అనంతర బుద్ధునిగా భావించే మైత్రేయా బుద్ధుడి ఆలయం ఇది.

చైనా టౌన్ సింగపూర్‌లోని అందమైన ప్రాంతాల్లో ఒకటి. ఇక్కడి షాపింగ్ వీధులు, గుడులు, చిన్న సన్నని సందులు అన్నీ చూడముచ్చటగా ఉంటాయి. నివాస ప్రాంతాల మధ్య ఈ గుడి ఎంతో సహజంగా అమరిపోయింది. అనేక అంతస్థులుండే ఈ భవనంలో కింది అంతస్థులో దేవాలయం. ఇందులో ప్రవేశించగానే బౌద్ధఉచ్చాటనల సంగీతం ఒక ప్రత్యేక వాతావరణాన్ని కల్పిస్తుంది. మైత్రేయా బుద్ధుని విగ్రహం చుట్టూ ప్రదక్షిణ మార్గంలో గోడలలో అనేక దీపపు గూడులు, ప్రతి ఒక్క గూడులో ఒక బుద్ధుడు... చూడడానికి ముచ్చటగా ఉంటుంది. పై అంతస్థులలో మ్యూజియం ఉంది. ఒక పెద్ద హాలు. అందులో అనేక చిన్న చిన్న బౌద్ధవస్తువులను, చరిత్రను వివరించే పటాలను దాటుకుంటూ వెడితే- పెద్ద గాజు గోడ, దాని వెనుక పెద్ద మండపం, అక్కడి నేలంతా బంగారు తాపడం, ఆ మండపంలో ఒక స్టాండ్, దాని మీద ఒక చెక్కముక్కకు బిగించి పెట్టిన బుద్ధుని దంతం. మానవ అవశేషాలైనా, మహానుభావుల అవశేషాలైనా, వాటిలో స్వయంసిద్ధంగా ఏ మహత్యమూ పవిత్రతా ఉండకపోవచ్చును గానీ, వాటికి మనుషులు ఆపాదించే విలువ ముఖ్యం. ఆ ధాతువును చూస్తూ, కళ్ల నీళ్లు పెట్టుకుంటూ భక్తిపారవశ్యంలో మునిగిపోయే బౌద్ధులను అనేకమందిని అక్కడ చూడవచ్చు

సింగపూర్ అంటే శివాలయం, బౌద్ధాలయం, మసీదు, చర్చి, మ్యూజియం, లైబ్రరీ.. జూదశాల.. అన్నీ. తమ సంస్కృతి, చరిత్రలో అంతర్భాగాలని చెప్పడానికి అత్యంత తాజాగా ఆ దేశం నిర్మించుకున్న దేవాలయం ఈ బుద్ధదంత ధాతు ఆలయం (బుద్ధాస్ టూత్ రెలిక్ టెంపుల్ అండ్ మ్యూజియం). సింగపూర్ వెళ్లినవారెవరూ దాన్ని చూడకుండా రాకండి!

**● సిరిసేన**

# నోరూరించే హ్యాండ్ బ్యాగులు...





గుమ్మడి కాయంత సైజులో ఉన్న ఒక పెద్ద లాలీపాప్‌ను భుజానికి వేలాడేసుకుని ఏ అమ్మాయైనా తిరుగుతుందా? ఆ... అలా ఎవరు చేస్తారు అనుకుంటున్నారా.. అలా ఒకమ్మాయి రోజూ చేస్తోంది. కేవలం లాలీపాప్ మాత్రమే కాదు.. చాక్లెట్స్, కేక్స్, బర్గర్స్, బిస్కెట్స్, కుక్కీస్, డోనట్స్, చాక్లెట్ క్యాండీస్, పిజ్జాస్, ఐస్‌క్రీమ్స్.. ఇలా ఒక్కటేమిటి బేకరీల్లో దొరికే తిండి పదార్థాలన్నిటినీ తాడు కట్టి వేలాడేసుకుని దర్జాగా తిరుగుతోంది. ఊరికే తిరగడం కాదు. రకరకాల ఫోజుల్లో ఫోటోలు దిగుతోంది. అయితే ఒక్క ఫోటోలో కూడా ఆమె వాటిని తింటున్నట్టు గాని, ఎవరికైనా వాటిని ఇస్తున్నట్టు గాని లేదు. ఎందుకంటే అవి తినే పదార్థాలు కావు. అలా కనిపించే హ్యాండ్ బ్యాగ్స్! ఆమె పేరు రోమ్మీ డే. నెదర్లాండ్స్‌లోని ఒక ఆన్‌లైన్ బట్టల దుకాణానికి యజమాని అయిన ఈ అమ్మడు ఫ్యాషన్ డిజైనర్ కూడా. తనకెంతో ఇష్టమైన తిండి పదార్థాల డిజైన్లతో ఇలా బ్యాగులను రూపొందించి, వాటిని వేసుకుని తిరుగుతూ.. వాటితో ఫోటోలు దిగి ఆన్‌లైన్‌లో షేర్ చేసి అమ్ముతుంది. ఆర్డర్ వచ్చిన తర్వాత మాత్రమే బ్యాగులు తయారుచేసే ఈమె బ్యాగులు కొనాలంటే మాత్రం బ్యాగుల నిండా డబ్బు చెల్లించాల్సిందే.. అంత ఖరీదుంటాయి మరి. ఈ నోరూరించే హ్యాండ్ బ్యాగుల కనీస ధర 201 డాలర్లు (13 వేల రూపాయల పైనే).

# కొత్తగా కాలర్ ఎగరేయండి..!







కాలర్ పట్టుకుంటే చాలు... ఆపుకోలేనంత కోపం వచ్చేస్తుంది చాలామందికి! అలా చేస్తే అది తమను అవమానించినట్టుగా భావిస్తారు. ఏదైనా విషయంలో ఎదుటి వ్యక్తిని ఓడించినా... పోట్లాటలో గెలుపొందినా.. ఎవరైనా తమను పొడిగినా..'కాలర్ ఎగరేసి' విజయగర్వాన్ని ప్రదర్శిస్తారు కొందరు.. ఇంకొందరైతే కాలర్ లేని చొక్కాలను తొడుక్కోడానికే ఇష్టపడరు. ఎందుకంటే వ్యక్తిత్వానికి, హోదాకు కాలర్‌ను చిహ్నంగా భావిస్తారు వీరు. అందుకే ఫ్యాషన్ ప్రపంచంలో కాలర్ స్థానమెప్పుడూ 'టాప్'లోనే ఉంటుంది! అటువంటి కాలర్‌కు కొంచెం క్రియేటివిటీ టచ్‌ను జోడిస్తే ఎలా ఉంటుంది? ఆ ఆలోచనకు ప్రతిరూపాలే ఈ 'క్రియేటివ్ కాలర్స్'. రంగురంగుల సీతాకోకచిలుక వచ్చి చొక్కాపై వాలినట్టుగా.. మెడ చుట్టూ ఒక పిల్లి చుట్టుకుని పడుకున్నట్టుగా.. చిన్ని చిన్ని పిట్టలొచ్చి కూర్చొని సేదతీరుతున్నట్టుగా.. వేరే వ్యక్తి చేతులు వచ్చి మన మెడలో ఏదో కడుతున్నట్టుగా.... పచ్చని ఆకులన్నీ అందంగా అమరినట్టుగా.. అనేక రకాలుగా కాలర్స్‌ను సృష్టించి ఫ్యాషన్ ప్రియులను ఇట్టే కట్టిపడేస్తున్నారు ఈ కాలర్ డిజైనర్లు. సాధారణ డ్రెస్‌కు కూడా రిచ్ లుక్‌ను తెచ్చిపెట్టే ఈ కాలర్స్‌ను తయారుచేయడం నిజానికి చాలా తేలిక.. వీటికి అయ్యే ఖర్చు కూడా చాలా తక్కువే.







# సాయమందించే 'కీచైన్లు'

**'కీచైన్'లో ఏముంటుంది?**

కీ, చైన్ తప్ప ఇంకేముంటుందని జోక్ చేయకండి. ఎందుకంటే మార్కెట్లోకి కొత్తగా వస్తున్న కీచైన్‌లలో బోల్డన్ని వింతలు, విశేషాలుంటున్నాయి. సరిగ్గా సమయానికి 'అరే కీ మిస్సయ్యిందే... ఎక్కడ పెట్టి మర్చిపోయానబ్బా' అంటూ జేబులు తడుముకోవాల్సిన అవసరం లేకుండా ఒక కీచైన్ తనను తానే కనిపెట్టుకోగలదు. అలాగే మద్యం తాగి వాహనం నడపాలని చూసేవాళ్లకు మరో కీచైన్ 'బ్రీత్ ఎనలైజర్'లా పనిచేస్తుంది. ఇది రక్తంలో ఉన్న ఆల్కహాలును (బ్లడ్ ఆల్కహాల్ కంటెంట్ - బిఎసి) ఇట్టే పసిగట్టి, మీ స్మార్ట్‌ఫోన్‌కు మెసేజ్ పంపుతుంది. ఒకవేళ మీరు అతిగా తాగి ఉంటే బిఎసి సాధారణ స్థాయికి రావడానికి ఎంత సమయం వేచిచూడాలో కూడా తెలుపుతుంది. ఇప్పుడు కీచైన్ కేవలం తాళాలను పట్టి ఉంచే వస్తువు కాదు... అదొక గాడ్జెట్, మల్టీటూల్ కిట్.

కంప్యూటర్, స్మార్ట్‌ఫోన్‌ల నుంచి వినిపించే శబ్దం సరిపోకపోతే ఉడెన్ కీచైన్‌లా కనిపించే 'టినీ ఉడెన్ అకార్న్ స్పీకర్'ను అటాచ్ చేస్తే సరిపోతుంది. రీచార్జబుల్ బ్యాటరీతో తయారైన ఈ కీచైన్‌లో నుంచి వచ్చే శబ్దం ఎక్కువగా ఉంటుంది. ఎఫ్.ఎం రేడియో కార్యక్రమాలను ఇయర్‌ఫోన్స్‌లో వినేకంటే ఈ బుల్లి స్పీకర్ ద్వారా స్పష్టంగా వినొచ్చు. ఇవేగాక టార్చ్‌లైట్ కీచైన్, కొలతల టేప్‌లాగా పనిచేసే 'క్రియేటివ్ టేప్ మెజర్' కీచైన్, చీకట్లో కూడా మెరిసే 'గ్లో' కీచైన్, మొబైల్ ఫోన్లను చార్జ్ చేసే 'పవర్‌స్టేషన్' కీచైన్, అవసరమైన చోట నట్లు, బోల్టులను ఫిట్ చేయడానికి పనికొచ్చే 'మల్టీ టూల్' కీచైన్, బాటిల్ ఓపెనర్స్‌ను ఇముడ్చుకున్న కీచైన్ ... ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో. మందుప్రియుల కోసం రెండు ఔన్సులు మాత్రమే పట్టే '2 ఔన్స్ ఫ్లాస్క్' కీచైన్‌లు కూడా ఉండటం కొసమెరుపు.



# ఛాయా'చిత్రమ్'



చంటి పిల్లలు అమ్మే కావాలని మారాం చేసినపుడు నాన్నలు ఈ చిట్కా పాటిస్తే సరి!

# స్వచ్ఛ భారత్ శాండల్స్



## • మళ్లీ కనిపించకు

"మేడం చీమల మందు కొంటారా?" అడిగాడు సేల్స్‌మ్యాన్.

"ఈ రోజు చీమలకు మందు కొంటే, రేపు దోమలు టానిక్స్ అడుగుతాయి .. వెళ్లవయ్యా" దబీమని తలుపేస్తూ అంది కాంతం.

# • మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

## నరకమా? ఓటమా?

"నువ్వు అబద్ధపు సాక్ష్యం చెబితే ఏమవుతుందో తెలుసా?" అడిగాడు జడ్జి.

"తెలుసండి. చచ్చిన తర్వాత నరకానికి పోతాను" చెప్పాడు శేషాచలం.

"గుడ్. మరి నిజం చెబితే?" అడిగాడు జడ్జి.

"కేసు ఓడిపోతాను" చెప్పాడు శేషాచలం.

## మీరే పొరపడ్డారు!

"ఏంటమ్మా ... సమస్య?" అడిగాడు డాక్టర్.

"మావారు నిద్రలో గురక పెడుతున్నారండి" చెప్పింది ఆదిలక్ష్మి.

"నేను మనుషుల డాక్టర్ని కాను పశువుల డాక్టర్ని" నవ్వాడు డాక్టర్.

"తెలుసండి. కాని ఆయన గురకలో గాడిద ఓండ్ర వినిపిస్తోంది" చెప్పింది ఆదిలక్ష్మి.

## వాట్సప్ బిచ్చగాడు



"అమ్మా .. ఆకలేస్తోంది. అన్నం ఉంటే పెట్టమ్మా .." అరిచాడు బిచ్చగాడు.

"ఇంకా వంటకాలేదు .. తర్వాత రా" చెప్పింది ఇల్లాలు.

"అయితే నా సెల్ నెంబరు చెబుతా .. వంటవగానే మిస్డ్ కాల్ ఇవ్వండి" సలహా ఇచ్చాడు బిచ్చగాడు.

ఒళ్లు మండిన ఇల్లాలు "అన్నం అవగానే వాట్సప్‌లో అప్‌లోడ్ చేస్తా. నువ్వు డౌన్‌లోడ్ చేసుకుని తిను" అంది కోపంగా.

## నేనెవరికి చెప్పుకోను?

నేనెవరికి చెప్పుకోను?

"నా భార్య ఎప్పుడూ తన మాజీ భర్త గురించి చెబుతూ ఉంటుంది. భరించలేకపోతున్నానురా ..." బావురుమన్నాడు శ్రీకాంత్.

"నీ భార్య పర్లేదురా .. నా భార్య కాబోయే భర్త గురించి చెప్పి భయపెడుతుందిరా" గొల్లుమన్నాడు రమాకాంత్.

## అనుమానం పీనుగు



"మీ ఆయనకు ఏమైనా పిచ్చా .. నా చుట్టూ తిరుగుతూ పరిశీలనగా చూస్తున్నాడెందుకు?" భయపడుతూ అడిగింది అలివేలు.

భర్త దూరంగా వెళ్లగానే "ఎవడైనా ఆడవేషంలో వచ్చి నాతో మాట్లాడుతున్నాడేమోనని అనుమానం" చెప్పింది చంద్రావతి.

## చీరలమ్మ

"అయ్యో .. వెంటనే మనం చీరలు కొన్న షాపుకు వెళ్లాలండి" కంగారుపడింది మాణిక్యం.

"చీరలు వదిలేశావా?" బైక్ వెనక్కి తిప్పుతూ అన్నాడు సుబ్రహ్మణ్యం.

"కాదు .. మన చంటిదాన్ని" చెప్పింది మాణిక్యం.

## గొప్పలమ్మ

"మా ఇంటికి చాలామంది వస్తుంటారు తెలుసా" గొప్పగా అంది పంకజం.

"అవునా ... మీవారేం చేస్తుంటారు?" అడిగింది జలజం.

"అప్పులు" రపీమని బదులిచ్చింది పంకజం.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## గర్భాశయ కణితుల సమస్యకు సరైన పరిష్కారం
(యుటెరైన్ ఫైబ్రాయిడ్స్)



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ఈ మధ్యకాలంలో స్త్రీలను వేధిస్తున్న అనేక ఆరోగ్య సమస్యలలో ఫైబ్రాయిడ్స్ అతి ముఖ్యమైనవి. ఈ వ్యాధి వలన ఏర్పడే తీవ్ర ఇబ్బందుల వలన కొన్ని సార్లు వీటిని శస్త్రచికిత్స ద్వారా తొలగించినప్పటికీ, ఇవి మళ్ళీ ఏర్పడటం మరియు వీటి యొక్క తీవ్రత అధికంగా ఉన్నట్లయితే - మరొక శస్త్రచికిత్స ద్వారా గర్భాశయపు తొలగింపు చర్యకు కూడా ఇవి కారణమవుతున్నాయి. తద్వారా చాలా మంది స్త్రీలు ఎన్నో తీవ్రమైన దుష్ప్రభావాలకు గురికావడం జరుగుతోంది. సహజంగా ఈ ఫైబ్రాయిడ్స్ 80% వరకు 50 సం॥ లోపు వయస్సు గల వారిలో ఎక్కువగా ఏర్పడుతున్నందున, 30 నుండి 77% వరకు పిల్లలను కనే వయస్సు గల మహిళలలోనే అధికంగా ఏర్పడటం వలన సంతానలేమికి కూడా ఇవి కారణమవుతున్నాయి. కాబట్టి వీటి పట్ల అవగాహన పెంచుకుని, వీటిని సత్వరమే గుర్తించడం ద్వారా మరియు సరైన హోమియో చికిత్సను అందించడం ద్వారా వీటిని పూర్తిగా నయం చేసే అవకాశం ఉంటుంది.

గర్భాశయంలో ఏర్పడే కణితులను లేదా గడ్డలను యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ అని అంటారు. ఇవి సాధారణంగా గర్భాశయపు కండర కణజాలంలో ఏర్పడతాయి. ఈ కణితులు ఒకటిగా గానీ లేదా చిన్న చిన్న కణితులు - గుంపులుగా గానీ ఏర్పడతాయి. ఈ యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ పరిమాణం రీత్యా, మిల్లీమీటరు మొదలుకొని కొన్ని సెంటీమీటర్ల వరకు పెరుగుతాయి. గర్భాశయంలో ఈ కణితులు ఏర్పడే ప్రాంతపు ఉనికి-ఎదుగుదల రీత్యా ఇవి 3 రకాలుగా కనిపిస్తుంటాయి. **(1) సబ్ సీరోసల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయపు వెలుపలి గోడలపై ఇవి ఏర్పడతాయి. 'సంతానలేమి'పై వీటి ప్రభావం చాలా తక్కువగా ఉంటుంది. కానీ ఈ కణితుల పరిమాణం పెరిగే కొద్దీ 'సంతానలేమి'పై ప్రభావం పడటం జరుగుతుంది. **(2) ఇన్‌ట్రామ్యూరల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయపు గోడల మధ్యలో ఇవి ఏర్పడతాయి. ఇన్‌ట్రామ్యూరల్ ఫైబ్రాయిడ్స్ చాలా సాధారణమైనవి. వీటి పరిమాణాన్ని బట్టి గర్భాశయపు కుహరాన్ని (గదిని) చిన్నదిగా చేసి పిండం ఎదుగుదలను అడ్డుకుంటాయి లేదా గర్భస్రావాన్ని కలిగిస్తాయి. **(3) సబ్‌మ్యూకోసల్ ఫైబ్రాయిడ్స్:** గర్భాశయంలో ఉండే మ్యూకోసల్ పొరలో ఇవి ఏర్పడతాయి. ఇవి పిండం యొక్క ప్రతిస్థాపనను (Implantation) మరియు ఎదుగుదలను అడ్డుకొని సంతానలేమికి దారితీస్తాయి. • ముఖ్యంగా ఇవి గర్భాశయపు అంచులోని ఫెలోపియన్ ట్యూబ్స్‌పై ఒత్తిడి పెరగడం వలన గానీ, అండం ప్రయాణించే దిశలో అడ్డంకుల వలన గానీ ఏర్పడతాయి. • మరికొందరిలో గర్భాశయపు ముఖద్వారం అనగా సర్విక్స్‌లో ఫైబ్రాయిడ్స్ ఏర్పడటంతో శుక్రకణాలు వెళ్ళే దారిలో అవి అడ్డు తెరలుగా రూపొందుతాయి. దీనివలన కూడా సంతానలేమి సమస్యలు ఏర్పడవచ్చు. • యుటెరైన్ ఫైబ్రాయిడ్స్ ఉండే గర్భిణీలలో, పిండంతో పాటుగా ఫైబ్రాయిడ్స్ ఎదగడం వలన గర్భాశయంలో ఉండే పిండానికి సరైన పోషణ అందక గర్భస్రావం అయ్యే అవకాశాలు కూడా ఉన్నాయి.



**కారణాలు:** ఋతుచక్రము త్వరగా ప్రారంభమయ్యే స్త్రీలలో ముఖ్యంగా 10 సంవత్సరాలకే రజస్వల కావడం వలన మరియు హార్మోన్‌ల అసమతుల్యత కారణంగా - ముఖ్యంగా ఈస్ట్రోజన్ మరియు ప్రొజెస్టిరాన్ హెచ్చుతగ్గుల వలన ఫైబ్రాయిడ్స్ ఏర్పడే అవకాశం ఉంటుంది. కాబట్టి ఋతుస్రావము ఆగిపోయిన స్త్రీలలో ఈ హార్మోన్‌ల ఉత్పాదన చాలా వరకు తగ్గడంతో, వీరిలో ఫైబ్రాయిడ్స్ వచ్చే అవకాశం తక్కువగా ఉంటుంది. స్థూలకాయం మరియు వంశపారంపర్యత మొదలైన కారణాల వలన కూడా గర్భాశయ కణితులు ఏర్పడే అవకాశాలు ఉంటాయి.

**లక్షణాలు:** గర్భాశయ కణితుల లక్షణాలు - అవి ఏర్పడిన స్థలము, పరిమాణము మరియు వాటి యొక్క సంఖ్యను బట్టి ఉంటాయి. కణితులు చిన్నవిగా ఉంటే లేదా మెనోపాజ్ వచ్చే దశలో ఉంటే - దాదాపు ఎలాంటి లక్షణాలు కనిపించకపోవచ్చు. ఇంతేకాకుండా ఋతుచక్రము ఆగిపోయిన స్త్రీలలో ఇవి కుంచించుకుపోయే అవకాశం ఉంటుంది. **ఈ లక్షణాలను మనం గమనించవచ్చు:** ఋతుచక్రములో అధిక రక్తస్రావము లేదా ఋతుస్రావము ఎక్కువ రోజులు కొనసాగటం, నడుము నొప్పి, కడుపు నొప్పి, కాళ్ళ నొప్పులు • ఫైబ్రాయిడ్స్ వలన మూత్రాశయంపై ఒత్తిడి పెరిగి, తరచూ 'మూత్రానికి వెళ్ళాలి' అనిపించడం • ప్రేగులపై ఒత్తిడి పెరగటం వలన మలబద్ధకం ఏర్పడటం మరియు కడుపుబ్బరంగా ఉండటం • అధిక రక్తస్రావము వలన రక్తహీనత కలిగే అవకాశం కూడా ఉంటుంది.

**నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలను బట్టి గానీ మరియు పెల్విక్ ఎగ్జామినేషన్, అల్ట్రాసౌండ్, ట్రాన్స్ వెజైనల్ స్కాన్, రక్తపరీక్ష, యమ్.ఆర్.ఐ. బయాప్సీ, హిస్టిరోస్కోపీ, హిస్టిరో సాల్పింగోగ్రఫీ, లాప్రోస్కోపీ వంటి పరీక్షల ద్వారా గానీ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో - గర్భాశయ కణితులు పూర్తిగా కరిగించబడేందుకు మరియు, హార్మోన్‌ల అసమతుల్యతను - ఋతుచక్ర సమస్యలను సరిచేసేందుకు గాను జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ సిమిలిమం ద్వారా సంపూర్ణమైన చికిత్సను అందివ్వడం జరుగుతుంది. అంతే కాకుండా శస్త్రచికిత్స చేయుటం ద్వారా గర్భాశయాన్ని తొలగించే అవసరం లేకుండా, కేవలం మందులతోనే ఈ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు. తద్వారా 'సంతానలేమి' సమస్యను పూర్తిగా దూరం చేసి, సంతానానికి మార్గం సుగమం చేయవచ్చు.

టోల్ ఫ్రీ 1800 108 1212
కన్సల్టేషన్ ఉచితం 955 000 1199
www.homeocare.in

Advt

ఇంటికి తాళం పెట్టి వీధి చివరికి వచ్చి ఆటో ఎక్కుతూ ఉండగా చేతిలోని ఫోన్ మోగింది.

ఫోన్ తీసీ తీయగానే "వదినా ఒక సందేహం" అంది మాధవి హడావుడిగా.

ఈ వారం కథ



బొమ్మలు : చారి పి.యస్.

# అదుపు

■ టి. శ్రీవల్లీ రాధిక

"చెప్పు."

"మరి రామాయణంలో లక్ష్మణుడు సీతమ్మని అమ్మలా భావించాడని అంటారు కదా!"

"ఊ... అంటారు."

"మరి సీతకి కూడా లక్ష్మణుడంటే అంత ప్రేమా వాత్సల్యం ఉన్నాయంటావా?"

"ఇదేమి సందేహం!" నేను నవ్వాను.

"ఏదోలే ... వచ్చింది. చెప్పు."

"ఇంట్లో లేను. మా జానకక్క దగ్గరికి వెళ్తున్నాను. తర్వాత మాట్లాడదాం" అన్నాను.

"అవునా... అయితే రాత్రికి చేస్తా... అప్పుడు చెప్పు" ఎంత హడావుడిగా చేసిందో అంతే హడావుడిగా ఫోన్ పెట్టేసింది మాధవి.

"సరే" అన్నాను కానీ అది అడిగిన ప్రశ్న గురించి ఆలోచన సాగలేదు. సీతమ్మని తప్పించి నా ఆలోచనలని జానకక్క ఆక్రమించింది.

తెనాలి నుంచి నిన్న పొద్దునే వచ్చింది జానకక్క. రాగానే ఫోన్ చేసింది. కల్యాణికి వచ్చిన ఇబ్బంది గురించి టూకీగా చెప్పి "ఎప్పుడొస్తావిటు? ఇంటికి వస్తే వివరంగా మాట్లాడుకోవచ్చు కదా!" అంది.

కల్యాణి మా చిన్ననాటి స్నేహితురాలు. జానకక్కా నేనూ పెళ్ళిళ్ళు చేసుకుని చాలా ఏళ్ళ క్రితమే హైదరాబాద్ వచ్చేసినా ఇప్పటికీ తెనాలి వెళ్ళినపుడల్లా కల్యాణిని చూడకుండా రాము.

కళ్యాణి, ఆమె భర్త ప్రసాద్ ఇద్దరూ ఉపాధ్యాయ వృత్తిలోనే ఉన్నారు. వాళ్ళకి ఇద్దరు పిల్లలు. రజని, శరత్. ఇద్దరూ బాగా తెలివైన పిల్లలు. రజని మరీనూ.

దాన్ని బాగా చదివించాలనీ పెద్ద ఉద్యోగస్తురాలిని చేయాలనీ అనుకునేవారు కళ్యాణి వాళ్ళు. మొన్ననే దానికి పద్దెనిమిదేళ్ళు నిండాయి. శరత్‌కి పదహారు నిండాయి. ఇంకేముంది.. ఇంకో సంవత్సరానికి వాడు కూడా ఇంజనీరింగ్‌లో చేరతాడు. రజని గురించి అయితే ముందే దిగులు లేదు. అదెలాగూ బ్రహ్మాండమైన మార్కులతో పాసై మంచి ఉద్యోగం సంపాదిస్తుంది ... అనుకుంటున్న సమయంలో ఆ కలలన్నిటినీ ఒక్క క్షణంలో నాశనం చేసి పారేసింది రజని!

నేను ఆటో దిగి లోపలికి వెళ్లేసరికి జానకక్క పడుకుని వుంది.

"ఏమయిందక్కా!" ఎప్పుడూ హుషారుగా ఉండే అక్కయ్య ఆ సమయంలో పడుకుని ఉండడం చూసి ఆశ్చర్యంగా అడిగాను.

"ఏం లేదు.. ప్రయాణం చేసి వచ్చిన అలసట, అంతే" నీరసంగా నవ్వుతూ చెప్పింది. మెల్లగా లేచి వంటగదిలోకి వెళ్తూ "వంట కూడా పెద్దగా ఏమి చేయలేదివాళ" అంది.

ఇద్దరం భోజనానికి కూర్చున్నాం. "కూరా పప్పూ చేశావు కదా.. ఇంకేమి కావాలి?" అన్నాను నేను కంచాలలో పదార్థాలు చూస్తూ.

"ఏమిటోనే.. ఈ రెండు రోజులూ నేను లేకపోతే పిల్లలు పచ్చళ్ళతోనే సరిపెట్టుకున్నారు. ఇవాళయినా కాస్త ప్రత్యేకంగా వాళ్ళకిష్టమయినదేదైనా చేద్దామంటే చేతకాలేదు..." అంది.

జానకక్కకి ఇద్దరూ ఆడపిల్లలే. మానస, మేఘన. మానస ఇంటర్ చదువుతోంది. మేఘన ఇంకా ఆరో తరగతిలోనే వుంది.

తెనాలిలో జానకక్క పేరు మీదున్న ఇల్లు అమ్మేశారు. దానికి సంబంధించిన లావాదేవీలు ఏవో వుంటే తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చి వెళ్ళింది కానీ లేకపోతే అసలు ఒక పట్టాన పిల్లల్నీ బావగారినీ వదిలి ఎక్కడికీ వెళ్ళదు జానకక్క. వాళ్ళకి ఒక్క చిన్న అసౌకర్యం కూడా కలగకుండా ఇరవై నాలుగు గంటలూ కాచుకుంటూ ఉంటుంది.

"పాపం చచ్చి బతికాడు ప్రసాద్. చాలా తీవ్రంగా వచ్చిందట గుండెపోటు. కొంచెం ఆలస్యమైనా దక్కేవాడు కాదన్నారట" అంటూ తెనాలి కబుర్లు చెప్పడం మొదలు పెట్టింది.

"కొంచెం కూడా ఊహించలేదట వాళ్ళు రజని ఇలా చేస్తుందని. తెలివైన పిల్ల. చక్కగా చదువుకునే పిల్ల. బాధ్యతగా ప్రవర్తిస్తుందనే నమ్మకంతోనే ఉంటారు కదా ఎవరైనా! ఆరోజు కళ్యాణీ ప్రసాదూ ఉద్యోగాలకి వెళ్ళారట. రజని మాత్రం కాలేజీకి వెళ్ళనని ఇంట్లోనే ఉండిపోయిందట. మధ్యాహ్నం రెండింటప్పుడు ఎవరో స్నేహితుడి ద్వారా విషయం తెలుసుకున్న శరత్ రొప్పుకుంటూ కల్యాణి దగ్గరకి వచ్చాడట. "అక్క పెళ్ళి చేసుకుంటోందట" అని వాడు చెప్పగానే కళ్యాణికి స్పృహ తప్పినంత పనయ్యిందిట."

"ప్రసాద్ గారి కాలేజ్ కూడా ఆ పక్కనే కదా!" అన్నాను నేను ఆ పరిస్థితిని ఊహించుకుంటూ.

"అవును, పక్కనే. ఫోన్ చేస్తే ప్రసాద్ కూడా వాళ్ళ దగ్గరికి వచ్చాడట. కళ్యాణితో పాటు పనిచేసే వాళ్ళు ఒకరిద్దరు ... అటు ప్రసాద్ ఫ్రెండ్స్ ఇద్దరు ముగ్గురు... అందరూ కలిసి కార్లేసుకుని వైకుంఠపురం వెళ్ళారట. కానీ అప్పటికే పెళ్ళి అయిపోయింది. తర్వాత కూడా బోలెడంత గోల. పోలీసు కంప్లయింటు.. వాగ్వివాదాలు.. అరుపులు.. కేకలు. ఎన్ని జరిగినా ఏం లాభం! పిల్ల పూర్తిగా వాళ్ళ పక్షం. నా ఇష్ట ప్రకారమే చేసుకున్నానంది. వాళ్ళతోపాటు వెళ్ళిపోయింది."

అక్క చెప్తుంటే నేను చిన్నగా నిట్టూర్చాను. "ఇంతకీ ఎవరసలు ఆ పిల్లాడు! దానితో పాటు చదువుకునేవాడా!"



"ఆ పెళ్ళికొడుకు స్నేహితులూ అలాంటి వారేనట. ప్రసాద్ నిస్సహాయంగా కూతుర్ని బ్రతిమలాడుతుంటే వాళ్ళందరూ వేళాకోళం చేయడం.. చెత్త జోకులేయడం.. నవ్వడం చేశారట. ఆ అవమానాన్ని తట్టుకోలేక పోయాడు ప్రసాద్. కూతురి జీవితం అలా అయిందన్న దిగ్భ్రాంతి ఒక పక్కన... ఈ అవమానాలన్నీ ఒక పక్కన" అంది జానకక్క.

"చదువా పాడా!" నా ప్రశ్నకి అక్క విసుక్కుంది. "అదే కదా అసలు బాధ! ఒట్టి జులాయి అట. రోడ్లు పట్టుకు తిరగడం.. ఊర్లో జరిగే గొడవల్లో తల దూర్చడం.. పోలీసులకి కూడా అతని చరిత్ర తెలుసు. వాళ్ళు కూడా సానుభూతిగా మాట్లాడారట."

ఆ మాట తర్వాత ఇద్దరం కాసేపు ఏమీ మాట్లాడలేదు. "ఆ పెళ్ళికొడుకు స్నేహితులూ అలాంటి వారేనట. ప్రసాద్ నిస్సహాయంగా కూతుర్ని బ్రతిమలాడుతుంటే వాళ్ళందరూ వేళాకోళం చేయడం.. చెత్త జోకులేయడం.. నవ్వడం చేశారట. ఆ అవమానాన్ని తట్టుకోలేక పోయాడు ప్రసాద్. కూతురి జీవితం అలా అయిందన్న దిగ్భ్రాంతి ఒక పక్కన... ఈ అవమానాలన్నీ ఒక పక్కన" అంది జానకక్క.

"ఊ..." అన్నాను నేను తల ఊపుతూ.

మాట్లాడుతూనే అన్నాలు తినడం పూర్తి చేసి ఇవతలికి వచ్చాం. ఒక అరగంట నడుము వాల్చామో లేదో జానకక్క మళ్ళీ లేచి ఏవో ప్రయత్నాలు మొదలు పెట్టింది వంటగదిలో.

"ఏం చేస్తున్నావక్కా!"

"మేఘన వచ్చీ రాగానే ఆకలి అంటుంది. ఏమన్నా ఫలహారం చేద్దామని" అంది.

ఎదురుగా బల్ల మీద కనిపిస్తున్న పళ్ళు, బిస్కట్లు చూస్తూ "ఇవన్నీ ఉన్నాయిగా!" అన్నాను నేను.

"అలాంటివి మానస తింటుంది కానీ మేఘనకి నచ్చవు. దానికి వేడిగా ఏమన్నా చేసి పెట్టాలి."

"ఓపిక లేదన్నావు కదక్కా! పోనీ నేను చేయనా!"

"వద్దులే, దానికి ఏవీ ఒక పట్టాన నచ్చవు" మురిపెంగా చెప్పింది.

అరటికాయ బజ్జీలు చేసింది. నాకు నాలుగు బజ్జీలు పెట్టి కాఫీ ఇచ్చి మేఘన కోసం చూస్తూ కూర్చుంది. నాలుగున్నర అయింది. మేఘన రాలేదు. నాలుగుసార్లు వాకిట్లో దాకా వెళ్ళి చూసి వచ్చింది జానకక్క.

మేఘన స్కూలు ఇంటికి దగ్గరే. సైకిల్ మీద వెళ్ళి వస్తుంది. మామూలుగా అయితే నాలుగింటికే రావాలి. ఇవాళ ఏమయిందో!

"వస్తుందిలే, కంగారు పడకు" అన్నాను నేను.

అయిదయింది. నాక్కూడా కొంచెం కంగారు అనిపించింది. స్కూలుకి ఫోన్ చేస్తే పిల్లలందరూ ఎప్పుడో వెళ్ళిపోయారని చెప్పారు. ఇక అప్పటినుంచి భయం మొదలయింది. ఆడపిల్లల మీద జరుగుతున్న అత్యాచారాల వార్తలన్నీ అక్క మనసులో గిరగిరా తిరిగిపోతున్నాయని తన మొహం చూస్తుంటే స్పష్టంగా అర్థమవుతోంది.

బావగారికి ఫోన్ చేశాం. "దార్లో వున్నాను.. రావడానికి ఇంకో గంట పడుతుంది" అన్నారాయన. ఇద్దరం కంగారు పడుతూ గగ్గోలు పడుతూ వుండగా... ఆరు తర్వాత మెల్లగా వచ్చింది మేఘన.

అది వాకిట్లో సైకిల్ నిలబెడుతూ ఉన్నపుడే జానకక్క నిటారుగా నిలబడి దానివైపు కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ చూసింది. మేఘన అది గుర్తించలేదు. నన్ను చూసి సంతోషంగా "పిన్నీ" అంటూ లోపలికి రాబోయింది.

అంతే. అది లోపలికి వస్తూ ఉండగానే జానకక్క ఒక్క ఉదుటున దాని దగ్గరికి వెళ్ళి "ఎక్కడికెళ్ళావే!" అని పెద్ద గొంతుతో అడిగింది.

అది సమాధానం చెప్పేలోపే "ఎంత కంగారు పడ్డానో తెలుసా! ప్రాణం పోయినంత పనయ్యింది. నేరుగా ఇంటికి రావాలని తెలియదూ!" అని గర్జించింది.

ఆ అరుపులకి మేఘన బిత్తరపోయింది. 'ఏమయింది అమ్మకి!' అన్నట్లు ఆశ్చర్యంగా చూస్తూ నిలబడిపోయింది.

"దివ్యా వాళ్ళింటికి వెళ్ళానమ్మా. అది ఇవాళ స్కూలుకి రాలేదు" అని మేఘన ఇంకా ఏదో చెప్పబోతూ ఉండగానే దాన్ని విసురుగా ఒక్క తోపు తోసి "నువ్వు నా కడుపున పుట్టిన శత్రువ్వే. నాకు తెలుసు. ఎప్పుడో కొంప ముంచుతారు మీరు! అమ్మ కంగారు పడుతుందన్న భయమైనా లేకుండా ఇంతసేపు బలాదూరు తిరిగొస్తావా!" అని ఇల్లు అదిరిపోయేట్లు అరిచింది జానకక్క.

"ఎందుకమ్మా అంత తిడతావు! ఇప్పుడు నేనేం చేశాను? నువ్వు చెప్పినట్లే వింటున్నా కదా!" ఏడుపు గొంతుతో అడిగింది మేఘన.

"ఆ.. వింటున్నావు. వింటున్నట్లే కనిపిస్తూ ఎంత పని చేశావు! అయిదు నిమిషాలు కాదు పది నిమిషాలు కాదు.. రెండు గంటలు.. రెండు గంటలసేపు అయిపు లేకుండా పోతావా! నీలాంటి వాళ్ళని నమ్మకూడదు. అమాయకంగానే కనిపిస్తూ ఎంత పనైనా చేస్తారు" పరుషంగా అంది జానకక్క.

"నేనేం చేయలేదమ్మా కావాలంటే దివ్యనడుగు..."

దాని సంజాయిషీ పూర్తవక ముందే "నోర్ముయ్" అని అరిచింది అక్క. "అడగడం కాదు.. గుర్తు పెట్టుకో. నువ్వేదన్నా వెధవ పని చేశావంటే నేను గోదాట్లో పడతాను. ఉరేసుకుంటాను. ఈ మేడ మీద నుంచి క్రిందికి దూకుతాను. ఒళ్ళు కాల్చుకునో విషం మింగో చస్తాను. అంతేకానీ నీ మొహం మాత్రం మళ్ళీ చూడను" ఏదో ఘోరం జరిగి పోయినట్లు జానకక్క ఏడుపు గొంతుతో అరుస్తుంటే నాకు మతిపోయింది.

మరొక పక్కన మేఘన గోడకి ఆనుకుని కూర్చుని వాళ్ళ అమ్మని బిత్తరపోయి చూస్తోంది.

నేను దాన్ని దగ్గరకి తీసుకోగానే ఏడుస్తూ నన్ను చుట్టుకుపోయింది. "నేనేం చేయలేదు పిన్నీ.. పొద్దున అమ్మ ఇచ్చిన యాభై రూపాయలు కూడా ఖర్చు పెట్టలేదు. మా ఫ్రెండ్స్ ఐస్ క్రీమ్ తిందామంటే కూడా వెళ్ళలేదు..." ఒక్కొక్క మాట వెక్కిళ్ళ మధ్య అది చెప్తుంటే నా కళ్ళల్లోకి నీళ్ళొచ్చాయి.

"ఏడవకు నాన్నా.. వెళ్ళు, వెళ్ళి మొహం కడుక్కో" అంటూ దాన్ని లోపలి గదిలోకి పంపించాను.

ఆ తర్వాత జానకక్క దగ్గరికి వెళ్ళి "ఏమిటక్కా ఇది!" అన్నాను కొంచెం తీవ్రంగానే. "నీకేమయినా పిచ్చెక్కిందా! అసలు దాని వయసేమిటి? నువ్వు మాట్లాడే మాటలు ఏమిటి? నువ్వేమంటున్నావో కూడా దానికి అర్థం కావడం లేదు తెలుసా!"

అక్క నిస్సత్తువగా కూలబడింది. "నీ కంగారుతో, భయంతో దాని బుర్రలో లేని ఆలోచనలు కూడా చొప్పిస్తావా! అదేం చేస్తుందని

భయపడుతున్నావో అదే దానికి నేర్పుతావా!" మందలిస్తున్నట్లుగా అడిగాను.

"నిజమేనే.." అంది జానకక్క కొంచెం తెలివిలోకి వచ్చినట్లుగా చూస్తూ. "కానీ నా భయం నాది" అంది తనలో తనే గొణుక్కుంటున్నట్లు.

"భయమేమిటి భయం! నువ్వు చేసింది చాలా తప్పు" ఖండిస్తున్నట్లుగా అన్నాను.

"భయం కాదా మరి. ఈ రోజుల్లో పిల్లలతో ఎన్ని సమస్యలుగా వున్నాయనుకున్నావు! అటు మగపిల్లలు చూస్తే తాగుళ్ళు, బైకుల మీద తిరగడాలు.. యాక్సిడెంట్లు.. ఇటు ఆడపిల్లలు చూస్తే మరొక రకం... ఎంత నరకం చూపిస్తున్నారో నీకు తెలీదూ! అలాంటప్పుడు తల్లిదండ్రులు జాగ్రత్త పడకూడదంటావా!" ఉక్రోషంగా అడిగింది.

"జాగ్రత్త ఎందుకు పడకూడదు! కచ్చితంగా పడాలి. కానీ భయపడడమే జాగ్రత్త పడడం కాదు. అది తెలుసుకోవాలి. మేఘన అనే కాదు.. మానసతో కూడా ఇలా మాట్లాడకూడదు నువ్వు. నీ పిల్లల సంగతి నీకు తెలీదూ! చెప్పిన మాట వినే రత్నాల్లాంటి పిల్లల్ని పట్టుకుని ఏ మాటంటే ఆ మాట అనేయడమేనా!" నేను రుద్ధమయిన గొంతుతో కొంచెం కోపంగానే విసుక్కున్నాను.

అప్పటికి జానకక్క కాస్త తేరుకుంది. "నా పిల్లల సంగతి తెలియక కాదే... కానీ రోజులెలా ఉన్నాయో చూస్తున్నావుగా!" అంది సంజాయిషీ ఇస్తున్నట్లుగా.

ఎప్పుడూ గంభీరంగా ధైర్యంగా తెలివిగా వుండే జానకక్క అలా బేలగా మాట్లాడగానే నా మనసు కరిగిపోయింది. అక్క భుజం మీద తలవాల్చాను. నా చుట్టూ ఒక చేయి వేసి అప్పుడే మొహం కడుక్కుని వచ్చిన మేఘనని మరొక చేత్తో ఒళ్ళోకి తీసుకుంది అక్క.

కొద్ది నిమిషాలు అలా మౌనంగా కూర్చున్నాం. మేఘన తల నిమురుతూ తన మాటలకీ అరుపులకీ సిగ్గు పడుతున్నదానిలా కూర్చున్న జానకక్కని చూస్తూ అనుకున్నాను 'పిల్లలు దారి తప్పుతారేమో తప్పుదోవలోకి వెళ్తారేమో అన్న భయం అన్నిటికన్నా పెద్ద భయం. అమ్మ మనసు దేన్నయినా తట్టుకుంటుందేమో కానీ దాన్ని తట్టుకోలేదు. ఎలాంటి పరిస్థితుల్లోనయినా ధైర్యంగా ఉండే స్త్రీ కూడా అటువంటి సమయాల్లో ఇలా విచక్షణ కోల్పోయినట్లుగా మాట్లాడుతుందేమో!

కానీ ఇది ఎన్ని అనర్థాలకి దారితీస్తుంది! మానవసంబంధాలని ఎంతగా దెబ్బ తీస్తుంది! ఈ భయాలూ ఆందోళనలూ ప్రమాదాలు జరిగేచోట వాటిని ఎంతవరకు నివారిస్తాయో తెలియదు కానీ ప్రమాదానికి పొరపాటుకి అవకాశమే లేని చోట్ల మాత్రం మనసులని చాలా బాధపెడ్తాయి. మళ్ళీ మాట్లాడితే పరోక్షంగా ప్రమాదాలకి కారణమవుతాయి కూడా.

కామక్రోధాదుల నుంచి భయశోకాల నుంచి మనసును రక్షించుకోవడం, చిత్తశుద్ధిని సాధించడం? ఇవన్నీ పరం కోసం అనుకుంటాం కానీ నిజానికి నియంత్రణ లేని మనసు ఇహంలో కలిగించే నష్టం కూడా సామాన్యమైనది కాదు. పొరపాట్లని నివారించడానికి బయటి పరిణామాలు, ప్రవర్తనలు, పరిస్థితులు వాటన్నిటి గురించీ తెలియడం కన్నా అలా తెలిసిన వాటి వలన మన మనసు అతలాకుతలం కాకుండా చూసుకోగలగడం మరింత ముఖ్యం'.

నా ఆలోచనలు రకరకాలుగా సాగాయి. ఎక్కడినుంచి ఎక్కడికో

"భయం కాదా మరి. ఈ రోజుల్లో పిల్లలతో ఎన్ని సమస్యలుగా వున్నాయనుకున్నావు! అటు మగపిల్లలు చూస్తే తాగుళ్ళు, బైకుల మీద తిరగడాలు.. యాక్సిడెంట్లు.. ఇటు ఆడపిల్లలు చూస్తే మరొక రకం... ఎంత నరకం చూపిస్తున్నారో నీకు తెలీదూ! అలాంటప్పుడు తల్లిదండ్రులు జాగ్రత్త పడకూడదంటావా!" ఉక్రోషంగా అడిగింది.

ఆలోచించుకుంటూ పోయి "అందుకే కాబోలు మంచి తప్పు చెడు వినకూడదు మాట్లాడకూడదు అంటుంటారు పెద్దవాళ్ళు. ప్రతి సమాచారమూ జ్ఞానం కాదు" అన్నాను.

నా ఆలోచనల తీగని వెంటనే పట్టుకున్నట్లు తల ఊపింది జానకక్క. "టీవీలో వార్తలయినా, సాహిత్యమైనా, చుట్టూ వున్న మనుషులైనా... ఏదైనా.." అంది తనలో తనే గొణుక్కుంటున్నట్లుగా.

"అవును, వాటిని మనం నియంత్రించలేము కానీ మన మనసుకీ మాటకీ మాత్రం మనమే యజమానులం" నేను పాఠం చెప్తున్నట్లుగా వాక్యం పూర్తి చేశాను

"అదుపు కోల్పోయి అదుపు సాధించలేమక్కా!"

కాసేపటి తర్వాత ఇంటికి బయల్దేరి బయటకి వచ్చి ఆటో ఎక్కుతుంటే సెల్‌ఫోన్ మోగింది - మాధవి.

నేనింకా ఇంటికి వెళ్ళలేదని అర్థమవగానే "నేనడిగిన విషయం చూడలేదన్న మాట అయితే" అంది.

"లేదు చూశ్చేదు.." అంటూ నవ్వాను నేను. "కానీ నీ ప్రశ్నకి సమాధానం తెలిసిందిలే. సీతమ్మ లక్ష్మణుడిని కన్నకొడుకులా భావించిందని చెప్పే సంఘటన రామాయణంలో స్పష్టంగానే వుంది."

"అవునా.. ఎక్కడ!"

"అరణ్యకాండలో.. ఆ సంఘటనలో సీతమ్మ మాట్లాడిన మాటలన్నీ కొద్దిసేపటి క్రితమే మరొక అమ్మ నోట విన్నాను. ఇంటికి చేరగానే నేనే ఫోన్ చేసి చెప్తాను."

"సరే" అంటూ వెంటనే ఫోన్ పెట్టేసింది మాధవి. అరణ్యకాండ అని నేనిచ్చిన సూచనతో అక్కడ మాధవి ఆ సంఘటనని గుర్తు పట్టిందో లేదో తెలీదు కానీ.. ఇక్కడ ఆటో సీటు మీద తలవాల్చి కళ్ళు మూసుకున్న నాకు మాత్రం నేను నేర్చుకున్న పాఠాన్ని మెచ్చుకుంటున్నట్లుగా తలపంకిస్తున్న సీతమ్మతల్లి చిరునవ్వులు కనిపించాయి.

valli.radhika@gmail.com



ఫుడ్ కోర్ట్

# పొరుగూరి రుచులు

## చికెన్ బఫెలో వింగ్స్

**కావలసిన పదార్థాలు :**

చికెన్ వింగ్స్ (రెక్కలు)- పావు కిలో, నిమ్మరసం- ఒకటిన్నర టీ స్పూన్లు, బత్తాయి రసం- మూడు టేబుల్ స్పూన్లు, సోయాసాస్- రెండు టీ స్పూన్లు, నూనె- అర టేబుల్ స్పూను, చక్కెర- రెండు టేబుల్ స్పూన్లు, అల్లంవెల్లుల్లి ముద్ద- ఒక టీ స్పూను, ఉల్లిపాయలు- రెండు, తరిగిన ఉల్లికాడలు- రెండు, ఉప్పు- చిటికెడు.

**తయారీ విధానం :**

ముందు రోజు రాత్రే నూనె మినహా మిగిలిన పదార్థాలన్నింటినీ కలిపి చికెన్ ముక్కలకు బాగా పట్టించి పక్కన పెట్టుకోవాలి. వండేటప్పుడు ఒక బాణలిలో నూనె పోసి బాగా వేడెక్కాక చికెన్ ముక్కల్నీ వేసి బంగారు రంగు వచ్చే దాకా వేగించి, పైన ఉల్లికాడల తురుము చల్లుకోవాలి. చాలా తేలిగ్గా చేసుకోవచ్చు దీన్ని.

## చెట్టినాడు చికెన్ కర్రీ



**కావలసిన పదార్థాలు:**

చికెన్- అర కిలో, దాల్చిన చెక్క- రెండు అంగుళాల ముక్క, యాలకులు- రెండు, తరిగిన ఉల్లిపాయలు- రెండు, టమోటాలు- రెండు (మెత్తగా రుబ్బుకోవాలి), నూనె- నాలుగు టేబుల్ స్పూన్లు, కరివేపాకు- కొద్దిగా, సోంపు, జీలకర్ర- ఒక్కో టీ స్పూను చొప్పున, లవంగాలు- నాలుగు, మిరియాలు- ఒక టీ స్పూను, ఎండుమిర్చి- నాలుగు, కారం- ఒక టేబుల్ స్పూను, ధనియాలు- ఒక టీ స్పూను, పసుపు- అర టీ స్పూను, అల్లంవెల్లుల్లి ముద్ద- రెండు టీ స్పూన్లు, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం:**

సోంపు, మిరియాలు, ఎండుమిర్చి, ధనియాలను కలిపి వేగించి, కొద్దిగా నీళ్ల పోసి మెత్తగా రుబ్బుకోవాలి. దానిలో పసుపు, అల్లంవెల్లుల్లి ముద్ద కూడా వేసి బాగా కలుపుకుని పక్కన పెట్టుకోవాలి. ఒక బాణలిలో నూనె పోసి వేడెక్కాక దాల్చిన చెక్క, యాలకులు, కరివేపాకు, లవంగాలు వేసి అవి వేగాక ఉల్లిపాయ ముక్కలు వేసి మరో 2 నిమిషాలు వేగించాలి. తర్వాత టమోటా గుజ్జు, అల్లం మసాలా ముద్ద కూడా వేసి మరో 5 నిమిషాలు వేగించాలి. ఆ తర్వాత చికెన్ ముక్కలు, కారం, ఉప్పు, కొద్దిగా నీళ్ల పోసుకుని చిన్న మంట మీద 10 నిమిషాల పాటు ఉడికించాలి.

## పనీర్ ఎగ్ కర్రీ

**కావలసిన పదార్థాలు:**

పనీర్ తురుము- ఒక కప్పు, పసుపు- పావు టీ స్పూను, కార్న్‌ఫ్లోర్- రెండు టేబుల్ స్పూన్లు, నూనె- వేగించడానికి సరిపడా, బిర్యానీ ఆకులు- రెండు, దాల్చిన చెక్క- ఒక అంగుళం ముక్క, యాలకులు- ఒకటి, లవంగాలు- మూడు, జీలకర్ర- ఒక టీ స్పూను, కారం- మూడు టీ స్పూన్లు, తరిగిన ఉల్లిపాయ- ఒకటి, అల్లం వెల్లుల్లి ముద్ద- ఒకటిన్నర టేబుల్ స్పూన్లు, పసుపు- అర టీ స్పూను, ధనియాల పొడి- ఒకటిన్నర టీ సూన్లు, జీలకర్ర పొడి- ఒక టీ స్పూను, ఆమ్‌చూర్ పొడి- టీ స్పూను, గరం మసాలా- అర టీ స్పూను, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం:**

పనీర్ తురుమును రెండు సమాన భాగాలుగా చేసుకోవాలి. ఒక భాగం పనీర్‌లో పసుపు, కొద్దిగా ఉప్పు వేసి కలుపుకుని లడ్డూల్లా చేసుకోవాలి. మిగిలిన సగం పనీర్ తురుములో కార్న్‌ఫ్లోర్ వేసి చపాతీల పిండిలా కలుపుకుని గుడ్డు ఆకారంలో మధ్యలో ఖాళీ ఉండేలా ఉండలు చేసుకోవాలి. వీటి మధ్యలో లడ్డూల్లా చేసిన పనీర్ ఉండలను పెట్టి ఒక టేబుల్ స్పూను నూనెలో దోరగా వేగించి పక్కన పెట్టుకోవాలి. తర్వాత మరో బాణలిలో రెండు టేబుల్ స్పూన్ల నూనె పోసి వేడెక్కాక బిర్యానీ ఆకు, దాల్చిన చెక్క, యాలకులు, జీలకర్ర వేసి వేగించాలి. తర్వాత ఉల్లిపాయ ముక్కలు, ఉప్పు, కారం వేసి



మరో 5 నిమిషాలు వేగించాలి. ఆ తర్వాత అల్లం వెల్లుల్లి ముద్ద, పసుపు, ధనియాల పొడి, గరం మసాలా, జీలకర్ర పొడి వేసి కొద్దిగా నీళ్ల పోసి 2 నిమిషాలు ఉడికించాలి. తర్వాత ఆమ్‌చూర్ పొడి, పనీర్ గుడ్లను (మధ్యలో రెండు ముక్కలుగా కోసి) వేసి చిన్న మంట మీద మరో 5 నిమిషాలు ఉడికించి దించేయాలి.




## రంగులు వేయండి



# ఆవుకొమ్ముల చేప

ఆవు ముఖాన్ని పోలిన ఆకారం, తలపై రెండు పొడవైన కొమ్ములు ఉండే వింత చేప 'లాంగ్ హార్న్ కౌ ఫిష్'. పసిఫిక్ మహా సముద్ర తీరంలోని ఉష్ణమండల దేశాల్లో ఈ చేపను చూడొచ్చు. 'బాక్స్ ఫిష్' జాతిలో ఇదొక రకం. రకరకాల రంగుల్లో, ఒంటిపై వివిధ డిజైన్లతో కనిపించే ఈ చేప శత్రువుల నుండి తనను తాను రక్షించుకోవడం కోసం తన చుట్టూ ఉన్న నీటిలోకి విషాన్ని వదులుతుంది. ఈ చేపలు పుట్టినపుడు ముదురు రంగుల్లో గుండ్రంగా ఉంటాయి. పెరిగేకొద్దీ లేత రంగుల్లోకి మారి నలుచదరంగా రూపాంతరం చెందుతాయి.



cow fish

* మహా సముద్రాల సగటు లోతు - 4 కిలోమీటర్లు
* ఫ్లెమింగోలు సంవత్సరానికి ఒక గుడ్డే పెడతాయి.
* 'స్టాట్యూ ఆఫ్ లిబర్టీ' కిరీటంపై ఉన్న ఏడు చువ్వలు... ఏడు ఖండాలకు గుర్తు.

## మీకు తెలుసా!

* రాక్షసబల్లులు తరచూ రాళ్లను మింగేవి. గ్రైండర్‌లో పాత్రంలా... ఆహారాన్ని జీర్ణం చేసేందుకు ఆ రాళ్లు ఉపయోగపడేవి.
* ప్రపంచంలోని అతి చిన్న వీధి స్కాట్లాండ్ దేశంలో ఎబెనీజర్ (Ebenezer). దాని పొడవు 6 అడుగుల 9 అంగుళాలు.



# 'మిర్చి' వీరుడు

chilli amedonou

ఒక మిరపకాయ పొరపాటున పంటికింద నలిగితేనే అల్లల్లాడిపోతాం. అలాంటిది ఆఫ్రికాలోని టోగో దేశానికి చెందిన అమిడోనో (Amedonou) అనే వ్యక్తి కేవలం ముప్పై సెకన్లలో 'భూత్ జొలోకియా' రకానికి చెందిన మూడు మిరపకాయలను తిని 'గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సు'లో చోటు సంపాదించుకున్నాడు. ఏంటి... మూడు తింటేనే గిన్నిస్ వచ్చిందా? అనుకోకండి. ప్రపంచంలోనే అత్యంత ఘాటైన మిర్చి భూత్ జొలోకియా. దాని ఘాటు వల్ల అది ఎప్పుడో గిన్నిస్ బుక్‌లోకి ఎక్కింది. మన మిర్చితో పోలిస్తే దాని ఘాటు 400 రెట్లు ఎక్కువ. ఈ మిర్చి మన దేశంలోని ఈశాన్య రాష్ట్రాల్లో కూడా పండుతుంది.







# స్మర్ఫ్స

## పిల్లలూ

మీ సమ్మర్ హాలిడేస్‌లో మిమ్మల్ని ఎంటర్‌టైన్ చేయడానికి రెడీ అవుతున్నారు హాలీవుడ్ స్మర్ఫ్స్ (Smurfs). అర్థం కాలేదు కదూ! స్మర్ఫ్స్ అంటే పుట్టగొడుగుల్లా ఉండే ఇళ్లల్లో నివసించే నీలిరంగు మనుషులు. మొదట వీళ్లు బెల్జియన్ టీవీ సిరీస్ కోసం పుట్టారు. తర్వాత యానిమేషన్ చిత్రాలకు కేరాఫ్ అడ్రస్‌గా నిలిచే హాలీవుడ్‌కి వెళ్లారు. అక్కడ వీళ్లను ప్రధాన పాత్రలుగా ఉంచి కొన్ని సినిమాలు వచ్చాయి. ఆ సిరీస్‌లో భాగంగానే త్వరలో 'స్మర్ఫ్స్ : ద లాస్ట్ విలేజ్' అనే సినిమాలో సందడి చేయబోతున్నారు. ఈ సినిమాలో ఒక మాంత్రికుడు వీళ్లకు సవాల్ విసరబోతున్నాడు. ఆ సవాల్ ఏమిటంటే దట్టమైన అడవి లోపల రహస్య ప్రదేశంలో ఉన్న ఒక గ్రామాన్ని కనుక్కోవడం. ఎవరు ముందు కనుక్కుంటే వారే విజేతలు.

# స్వర్గద్వారం



దక్షిణ అమెరికాలోని పెరు దేశంలో కఠినశిలలతో కూడిన హయు మర్కా (Hayu Marca). అనే ప్రాంతం ఉంది. దీనిని 'దేవతల నగరం'గా పిలుస్తారు స్థానికులు. ఎందుకంటే అక్కడి రాళ్లు దేవతల ఆవాసాలను పోలి ఉంటాయి. ముఖ్యంగా అక్కడ అందరినీ విపరీతంగా ఆకట్టుకునే నిర్మాణం 'స్వర్గద్వారం'. 7 మీటర్ల ఎత్తు, 7 మీటర్ల వెడల్పు ఉన్న ఆ ద్వారం మధ్య చిన్న రంధ్రం ఉంది. ఆ రంధ్రానికి సరిగ్గా సరిపోయే ఒక బంగారు చక్రం ఆనాటి పూజారి దగ్గర ఉండేదని దాన్ని ఒక దేవత స్వాధీనం చేసుకున్న తర్వాత ఆ పూజారి కనిపించకుండా మాయమైపోయాడని అక్కడో జానపద గాథ ప్రచారంలో ఉంది. ఈ నిర్మాణాలు అలనాటి 'ఇన్‌కా' నాగరికత ఆనవాళ్లు అయ్యుండచ్చని భావిస్తున్నారు.

# బుచికి




# • చుక్కలు కలపండి



## నా బొమ్మ



**ఎం. పూజిత,**
*6వ తరగతి,*
*శ్రీ భావన విద్యానికేతన్,*
*విశాఖపట్టణం*





# అనుగ్రహం

5-11 మార్చి 2017

డాక్టర్ పి.ఎ. రామన్



## మేషం

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. నిరుత్సాహం వీడి యత్నాలు సాగించండి. మీ కృషి ఫలించే రోజు త్వరలోనే ఉంది. పరిచయాలు ఉన్నతికి తోడ్పడతాయి. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. సంప్రదింపులు, ఒప్పందాలకు అనుకూలం. మొహమాటాలు, భేషజాలకు పోవద్దు. కోల్పోయిన పత్రాలు, వస్తువులు చేజిక్కించుకుంటారు.



## వృషభం

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

ఈ వారం అన్ని విధాలా అనుకూలమే. ఆర్థికంగా కుదుటపడతారు. రుణ బాధలు తొలగుతాయి. పనులు సకాలంలో పూర్తి కాగలవు. ఆహ్వానాలు సంతోషపరుస్తాయి. శుభకార్యాల్లో విలువైన కానుకలు చదివించుకుంటారు. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. కొత్త విషయాలు గ్రహిస్తారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. ఎవరిపై ఆధారపడవద్దు.



## మిథునం

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. బంధుత్వాలు, పరిచయాలు బలపడతాయి. వాగ్ధాటితో ఆకట్టుకుంటారు. ఆది, సోమ వారాల్లో పనుల ప్రారంభంలో చికాకులెదుర్కుంటారు. మీపై శకునాల ప్రభావం అధికం. కుటుంబీకుల మధ్య కొత్త విషయాలు ప్రస్తావనకు వస్తాయి. పెద్దల సలహా పాటించండి. నోటీసులు, కీలక పత్రాలు అందుతాయి.



## కర్కాటకం

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

నిర్దిష్ట ప్రణాళికలతో యత్నాలు సాగిస్తారు. పరిస్థితులు అనుకూలిస్తాయి. శుభకార్యాలకు హాజరవుతారు. ధనానికి ఇబ్బంది ఉండదు. సకాలంలో వాయిదాలు చెల్లిస్తారు. కొన్ని పనులు అనుకోకుండా పూర్తవుతాయి. మంగళ, బుధ వారాల్లో పరిచయం లేని వారితో జాగ్రత్త. బ్యాంకు అకౌంట్ వివరాలు వెల్లడించవద్దు. ఇతరుల విషయాలు తెలుసుకోవాలన్న ఆసక్తి తగదు.



## సింహం

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

కొన్ని విషయాలు ఊహించినట్టే జరుగుతాయి. ఆలోచనలు నిలకడగా ఉండవు. అప్రమత్తంగా వ్యవహరించాల్సిన సమయం. అనుభవజ్ఞుల సలహా పాటించండి. వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. పనులు హడావుడిగా సాగుతాయి. గురు, శుక్ర వారాల్లో ఖర్చులు విపరీతం. వాగ్వాదాలు, పంతాలకు పోవద్దు. ప్రస్తుత వ్యాపారాలే శ్రేయస్కరం.



## కన్య

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

శ్రమాధిక్యత మినహా ఆశించిన ఫలితం ఉండదు. రాబోయే ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. పనులు సాగక విసుగు చెందుతారు. శనివారం నాడు కావలసిన వ్యక్తుల కలయిక సాధ్యం కాదు. విలువైన వస్తువులు, పత్రాలు జాగ్రత్త. ప్రతి విషయంలోనూ అప్రమత్తంగా ఉండాలి. సలహాలు, సహాయం ఆశించవద్దు. స్వయంకృషితోనే రాణిస్తారు.



## తుల

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

వ్యవహారాలు, ఆర్థిక లావాదేవీలతో తీరిక ఉండదు. పెట్టుబడులకు సమయం కాదు. స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోండి. సలహాలు, సహాయం ఆశించవద్దు. ఓర్పుతో పనులు పూర్తి చేస్తారు. ఆది, సోమ వారాల్లో ఖర్చులు అధికం. చేతిలో ధనం నిలబడదు. పొదుపు మూలక ధనం ముందుగానే గ్రహిస్తారు. కొత్త సభ్యత్వాలు స్వీకరిస్తారు.



## వృశ్చికం

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

వ్యవహారాల్లో ఆకస్మిక నిర్ణయాలు తీసుకోవలసి వస్తుంది. పెద్దల సలహా పాటించండి. కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. అవకాశాలు అందినట్టే చేజారిపోతాయి. పనులు సకాలంలో పూర్తి చేస్తారు. ఊహించిన ఖర్చులే ఉంటాయి. రుణ విముక్తులవుతారు. పెట్టుబడులు, పొదుపు పథకాలకు అనుకూలం. విలువైన వస్తువులు, వాహనం మరమ్మతుకు గురవుతాయి.



## ధనుస్సు

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తారు. సమర్థతకు గుర్తింపు లభిస్తుంది. శుభకార్యాలను ఘనంగా చేస్తారు. ఖర్చులు అధికం, సంతృప్తికరం. విలాస వస్తువులు అమర్చుకుంటారు. రశీదులు, పత్రాలు జాగ్రత్త. కొన్ని పనులు అనుకోకుండా పూర్తవుతాయి ఆది, గురువారాల్లో బాధ్యతగా వ్యవహరించాలి. ఎదుటివారి ఆంతర్యం గ్రహించండి. పంతాలు, భేషజాలకు పోవద్దు.



## మకరం

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

ఆర్థిక లావాదేవీలు ఆశాజనకం. సమయోచిత నిర్ణయాలు తీసుకుంటారు. ధనమూలక సమస్యలు కొలిక్కి వస్తాయి. ఖర్చులు సామాన్యం. ఆత్మీయులకు సాయం అందిస్తారు. పనులు సానుకూలమవుతాయి. సంతోషకరమైన వార్తలు వింటారు. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. మంగళ, శని వారాల్లో అవగాహన లేని విషయాలకు దూరంగా ఉండాలి.



## కుంభం

**ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

వ్యవహార జయం, ధనలాభం. ఆర్థిక అంచనాలు ఫలిస్తాయి. ఖర్చులు భారమనిపించవు. విలాస వస్తువులు కొనుగోలు చేస్తారు. గృహమార్పు కలిసివస్తుంది. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. సన్నిహితులకు చక్కని సలహాలిస్తారు. పెట్టుబడులు, సంస్థల స్థాపనలకు అనుకూలం. ఉద్యోగ బాధ్యతల్లో ఏకాగ్రత వహించండి. మీ బలహీనతలు అదుపులో ఉంచుకోండి.



## మీనం

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

మీ ఓర్పునకు పరీక్షా సమయం. బాధ్యతగా వ్యవహరించాలి. మీ తప్పిదాలను సరిదిద్దుకోండి. ఎవరినీ నిందించవద్దు. మొహమాటాలకు పోయి ఇబ్బందులెదుర్కుంటారు. ఆత్మీయుల సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. కీలక పత్రాలు అందుకుంటారు. ఒక సమాచారం ఉపశమనం కలిగిస్తుంది. ఆరోగ్యం, కుటుంబ విషయాలపై శ్రద్ధ అవసరం.



## ఈ వారం కవిత

# మట్టికి

మట్టికి
మరణించే హక్కు లేదు
అది చచ్చినట్టు బతకాల్సిందే,
శ్రమసౌందర్యం తెలిసిన మట్టికి
మూగబోయే హక్కు లేదు
మౌనంగా ఉండే హక్కూ లేదు.

పంట కాలువగా
నాగలి బోదెగా విచ్చుకుంటున్న మట్టికి
మనుషుల్ని తిరస్కరించే హక్కు లేదు,
లోకానికి నీళ్ల దోసిళ్లతో తాపే మట్టికి
నేను నీరు కాదని చెప్పే స్వేచ్ఛ లేదు,

సమస్త జంతు జాలాన్ని
వృక్ష సముదాయాన్ని
చరాచర ప్రపంచాన్ని
పెంచి పోషించే ధరిత్రికి

ప్రాణం పోసే హక్కు తప్ప
ప్రాణం తీసే హక్కు లేదు.

(శిఖా ఆకాశ్‌కు ప్రేమతో ...)

**- కె. శివారెడ్డి**, 040 - 24064195

---

# విజయ'గీత్'

న్యాయశాస్త్రంలో డాక్టరేట్, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, సమాజసేవకురాలు, బేస్‌బాల్ ప్లేయర్, నర్తకి, నటి... ఇన్ని ప్రత్యేకతలు ఒక్కరిలో ఉండడం అసాధ్యం. ఎవరిలోనైనా ఉంటే వారిని చూసి ఆశ్చర్యపోతాం.. పైగా అన్ని ప్రత్యేకతలు ఉన్న వ్యక్తి.. వీల్‌ఛైర్‌కి మాత్రమే పరిమితమైన ఒక వికలాంగురాలైతే... ఆమెకు సెల్యూట్ చేయకుండా ఉండలేం. ఆమె పేరే గీత్. 'భారతదేశంలో మొట్టమొదటి వీల్‌ఛైర్ యాక్ట్రెస్'గా సోషల్ మీడియాలో ఎంతో గుర్తింపు పొందిన గీత్ గురించి కొన్ని ఆసక్తికర విషయాలు.

గీత్‌కు పదేళ్లు ఉన్నప్పుడు కారు ఆక్సిడెంట్‌లో వెన్నుపూస విరిగి, రెండు కాళ్లు చచ్చుబడిపోయాయి. "నేనెప్పటికీ నడవలేనని డాక్టర్ చెప్పారు. నమ్మలేకపోయాను. బాగా ఏడ్చాను. కొన్ని రోజులపాటు ఏడుస్తూనే ఉన్నాను. జీవితంలో ఇక ఏమీ చేయలేనేమోనని నిరుత్సాహపడ్డాను. ఒక్కసారిగా వీల్‌ఛైర్‌పై కదలలేకుండా జీవచ్ఛవంలా ఉండటం కన్నా చచ్చిపోవడమే మేలనిపించింది. కాని నా తల్లిదండ్రులు, స్నేహితులు చూపించిన ప్రేమ, మేమున్నామనే భరోసాతో తిరిగి ధైర్యం కూడగట్టుకున్నాను. ఆ ధైర్యంతోనే ప్రపంచానికి నేనేంటో నిరూపించుకోవాలని నిశ్చయించుకున్నాను. అయినా కాళ్లు లేనిది నా శరీరానికి మాత్రమే, నాకు కాదు అనే నమ్మకం కలిగింది. ప్రపంచాన్ని చుట్టడానికి కాళ్లు కావాలేమో కాని.. ప్రపంచానికి నేనేంటో పరిచయం కావడానికి కాళ్లతో పనేంటి..?" అంటున్నప్పుడు ఆమె కళ్లు ఆత్మవిశ్వాసంతో తొణికిసలాడాయి.



చదువుల్లో క్లాస్ టాపర్‌గా నిలవడమే కాదు.. చేతులను కదుపుతూ, ముఖ కవళికలతోనే నాట్యం చేస్తూ అందరినీ ఆశ్చర్యపరిచింది. ఇంగ్లీషు సాహిత్యం అంటే ఎంతో ఇష్టపడే గీత్ ఎన్నో కథలను రాసింది, ఎన్నో డ్రామాలకు స్క్రీన్‌ప్లే కూడా అందించింది.

"అంగవైకల్యం ఉన్నా ఏదైనా సాధించాలనుకునే వారికి మొదట వచ్చే 'కానుకలు'- విమర్శలు.. అవమానాలే! నేనూ అవమానాలను ఎదుర్కొన్నా. నేను నటించాలని ఉందని చెప్పిన ప్రతిసారీ చాలామంది హేళన చేసారు. తెర వెనక కూర్చొని చేసే పనులేవైనా చేసుకొమ్మని ఉచిత సలహా ఇచ్చేవారు" అందామె.

తల్లిదండ్రుల కోరిక మేరకు తనకిష్టమైన సాహిత్యాన్ని పక్కనపెట్టి, ఇంజనీరింగ్ చేసింది గీత్. అంతేకాదు న్యాయశాస్త్రంలో కూడా డాక్టరేట్ సాధించి, తనను ఎగతాళి చేసిన వారి నోళ్లు మూయించింది. "చిన్నతనం నుంచే నాకు నటనంటే ఎంతో ఆసక్తి. డైనింగ్ టేబుల్ దగ్గర ఎన్నో వేషాలు వేసేదాన్ని. నాటకాలు ఆడేదాన్ని. నాకు నచ్చిన పాత్రలను అనుకరించేదాన్ని. అలా ఆ వయసులోనే ఎప్పటికైనా సినిమాల్లో నటించాలనే కోరిక ఉండేది." అని చెప్పిన గీత్. జీ నెట్‌వర్క్ నిర్వహించిన టాలెంట్ హంట్ షో (Best Cinestar's ki Khoj) లో ఫైనల్ రౌండ్ దాకా కూడా వెళ్లింది. కాని ఫైనల్ రౌండ్ డాన్సింగ్ రౌండ్ కావడంతో గీత్ సెలక్ట్ కాలేదు. కాని కొన్ని లక్షల మంది వీక్షకుల హృదయాలను గెలుచుకుంది. ప్రస్తుతం ఆమె ఫేస్‌బుక్ పేజీని 16 లక్షల మందికి పైగా ఫాలో అవుతున్నారు.

చాలామంది ఆమెకు ఇంకొకరి సాయం అవసరం అనుకుంటారు.. కాని ఆమె ఇప్పటికే కొన్ని వందల మందికి సహాయం చేసింది. అందుకోసం అమెరికాలో ప్రముఖ కంపెనీలో లక్షల జీతం వచ్చే ఉద్యోగాన్ని కూడా వదిలేసింది. గీత్ ఒక మోటివేషనల్ స్పీకర్ కూడా. చిన్న చిన్న సమస్యలకే కుంగిపోయే వారికి ఆమె తన మాటల ద్వారా జీవితంపై ఒక నమ్మకాన్ని ఇస్తోంది.

'ఈ ప్రపంచం పైకి వేటకెళ్లు మిత్రమా... విజయాలు అనే చేపలు నీ వలలో వచ్చి పడతాయి' అన్న నానుడిని నిజం చేసి చూపిన ధీర వనిత గీత్. తన కోసం ఏదైనా చేయడానికి సిద్ధపడేవాళ్లు ఉన్నా, కాని ఆమె ఎవరి నుంచి ఏ సహాయం కోరుకోలేదు. సొంతంగానే అనుకున్నది సాధించి యూత్ ఐకాన్‌గా నిలిచింది. ■

## కొత్త పుస్తకాలు

## చేను గట్టుపై కవితా తోరణం



'చెరువును రెక్కల మీద ఎగరేసుకుపోవాలని/ఆ పిట్ట ఏవో పథకాలు పన్నుతోంది' అంటూ నెపం కాసేపు పిట్ట మీద వేస్తాడు గానీ, నిజానికి ప్రసాదమూర్తి కవిత్వం పాఠకులను అక్షరాల రెక్కలపై ఎత్తుకుపోతుంది. 'చేనుగట్టు పియానో'లో కవిత్వమే కాదు, కవిత్వం పైన కూడా కవితలున్నాయి. 'కన్నీళ్ళు అక్షరాలుగా మరిగించి/అక్షరాలను అన్నం మెతుకులుగా ఉడికించి/నీ కోసం వణుకుతున్న చేతులతో/నేను లేని శూన్యంలో కూడా కంచం తుడుస్తూ ఉంటాను' అంటూ రోహిత్‌ను తలచుకుంటాడు. సొంత ఊరు, స్నేహితులు, సముద్రమూ ప్రధాన కవితా వస్తువులైనా, సామాజిక సంఘటనలపైన కూడా సున్నితంగా స్పందిస్తాడు. 'చెరువుని మొలకు చుట్టుకుని/చెట్టెక్కిన జ్ఞాపకాలు', 'ఉదయంపూట వానలా వచ్చాడు/ చిన్ననాటి సంగతులన్నీ/చల్లగాలిలో మూటగట్టి' తెచ్చిన స్నేహితుడు, 'పిల్ల మబ్బులు అల్లరి అలలై/ కేరింతలు' కొట్టే సముద్రం, 'నిన్న చనిపోయిన రైతు/మొన్న చనిపోయిన రైతులా నవ్వుతూ/ ఈ రోజు చనిపోయిన రైతులా' భయపెట్టడం వంటి ఎన్నో వైవిధ్యమైన స్వరాలను అలవోకగా పలికిస్తాడు.

**- దేరా**

**చేనుగట్టు పియానో**, ప్రసాదమూర్తి, **పేజీలు :** 143, **వెల :** రూ.100, **ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

## తెలుగు సినిమా దృశ్య కథనం

**85** ఏళ్ల తెలుగు సినిమా చరిత్రలో ఆణిముత్యాల్లాంటి సినిమాలు ఎన్నో ఉన్నా ఆయా సినిమాలకు సంబంధించిన విశేషాలే తప్ప, 'సినిమా కళ'పై (ముఖ్యంగా స్క్రీన్‌ప్లే) అవగాహన పెంచే రచనలను వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు. దేశంలోనే అత్యధిక చిత్రాలను నిర్మించే (హిందీ తర్వాత) ఘనత ఉన్న తెలుగు చిత్రసీమలో మిగతా భాషలతో పోల్చితే అలాంటి ప్రయత్నాలు కూడా తక్కువే. 'తెలుగు సినిమా స్క్రీన్‌ప్లే' అనే ఈ సిద్ధాంత గ్రంథాన్ని డాక్టర్ పుట్ట యాదేశ్ పి.హెచ్.డి కోసం రాశారు. 1932-80 మధ్య విడుదలైన 'మాలపిల్ల', 'పల్నాటి వీరచరిత్ర', 'గుణసుందరి కథ', 'పాతాళభైరవి', 'మాయబజార్', 'మహామంత్రి తిమ్మరుసు', 'శ్రీకృష్ణార్జున యుద్ధము', 'ముత్యాలముగ్గు', 'శంకరాభరణం', 'మాభూమి'లను (మొత్తం 10) ఎంచుకుని వాటి 'దృశ్య కథనం' వివరించే ప్రయత్నం చేశారు. ఈ సినిమాలను ఎంచుకోవడానికి యాదేశ్ 'ఒక పద్ధతి'ని పాటించినట్టు 'ప్రారంభం'లోనే చెప్పుకున్నప్పటికీ 'తెలుగు సినిమా స్క్రీన్‌ప్లే'ను ఆయన తనకున్న లిమిటేషన్లోనే చర్చించినట్లుగా అనిపిస్తుంది. ఒక విశ్లేషకుడిలా కాకుండా ఒక పరిశోధకుడిగా పుస్తకరచన చేయడం వల్ల సాధారణ పాఠకులకు రచనాశైలితో పాటు కొన్ని పదాలు (ఉదాహరణకు ఫలిత సాధన, రస నిర్వహణ, విశ్వప్రక్రియ ఇతివృత్త విభాగాలు) ఇబ్బంది కలిగిస్తాయి. ఒక సినిమాను పలు విభాగాల కింద వివరించేప్పుడు రిపిటేషన్స్ ఎక్కువగా ఉన్నాయి. పి.హెచ్.డి పుస్తకాలను పాఠకుల కోసం అచ్చువేసేటపుడు చాలా ఎడిటింగ్ అవసరం. అయితే యాదేశ్‌కు ఇదే మొదటి గ్రంథం కాబట్టి రాబోయే కాలంలో పాఠకులను దృష్టిలో పెట్టుకుని ఆయన రచనలు కొనసాగిస్తారని ఆశిద్దాం.



**- చల్లా**

**తెలుగు సినిమా స్క్రీన్‌ప్లే**, డాక్టర్ పుట్టయాదేశ్, **పేజీలు:** 312, **వెల:** రూ.300 **ప్రతులకు:** 94901 43067

## ఒక ఆత్మీయ స్పర్శ కోసం...




**క**ష్టాలు చెప్పుకోవాలన్నా నా అన్నవారు లేక మనసులోనే కుమిలిపోతున్న అభాగ్యులెందరో! అలాంటి వారికి 'మైత్రి' శీర్షిక ద్వారా ఊరడింపు ఇచ్చారు జలంధర. సమాజంలో ఇన్ని రకాల సమస్యలున్నాయా అని చదువరి ఆశ్చర్యపడేటన్ని సమస్యలు, వాటికి పరిష్కారాలు ఇందులో ఉన్నాయి. అన్నిటికీ జలంధర ఎంతో ఆత్మీయంగా, జీవితంపై ఆశ కలిగేలా జవాబులిచ్చారు. మన సమస్యలకూ పరోక్షంగా వీటిల్లో జవాబు దొరకొచ్చు - చదవండి!

**మైత్రి** (మొదటి భాగం), జలంధర **పేజీలు :** 200, **వెల :** రూ. 155, **ప్రతులకు :** 90004 13413

## ఇవీ వచ్చాయి

**ప్రతీకార వలయం** (భారతంలోని కొన్ని అసాధారణ కథలు)
**పేజీలు :** 164, **వెల :** రూ.150

**అదృశ్యమైన ఆలయం**
**పేజీలు :** 124., **వెల :** రూ.130

**తడి ఆరని సంతకాలు**
**పేజీలు :** 134, **వెల :** రూ.120
పై మూడు పుస్తకాల
**రచన :** సుధామూర్తి
**అనువాదం :** ఎం. కృష్ణకుమారి, అరుణ పప్పు
**ప్రతులకు :** 0866 - 2476966

**తిలక్ సాహితీ సందర్శనం**
(సాహితీవేత్తల వ్యాస సంకలనం)
**గౌ.సం. :** పెనుగొండ లక్ష్మీనారాయణ
**సం. :** కె. శరచ్చంద్ర జ్యోతిశ్రీ
**పేజీలు :** 320, **వెల :** రూ.240
**ప్రతులకు :** విశాలాంధ్ర

**ఖలిల్ జిబ్రాన్ రచనలు**
**తెలుగు :** కె.బి. గోపాలం
**పేజీలు :** 216, **వెల :** రూ.150
**ప్రతులకు :** 98480 65658

**విజ్ఞాన శాస్త్రాలు - అవకాశాలు**
**రచన :** ఎ.పి.జె. అబ్దుల్ కలాం, సృజన్‌పాల్ సింగ్
**అనువాదం :** త్రిమూర్తి
**పేజీలు :** 170, **వెల :**రూ.195
**ప్రతులకు :** 0866 - 2476966

**బాలల ఏకపాత్రాభినయాలు**
**సం :** వల్లూరు శివప్రసాద్
**పేజీలు :** 52, **వెల :** రూ.60
**ప్రతులకు :** విశాలాంధ్ర, నవచేతన

**సాదృశ్యం** (కథా సంపుటి)
**రచన :** బి.వి. శివప్రసాద్
**పేజీలు :** 126, **వెల :** రూ.100

**తథ్యము సుమతీ!**
**రచన :** డా. మచ్చ హరిదాసు
**పేజీలు :** 232, **వెల :** రూ.200

**నిరంతర ప్రేరణ**
**రచన :** మోహన
**పేజీలు :** 132, **వెల :** రూ.399
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

## హెపటైటిస్ వైరస్ ఇలా తగ్గింది

**నా పేరు** దీప. నా వయస్సు 38 సంవత్సరాలు. కొన్ని రోజుల క్రితం నేను చావు అంచుల వరకు వెళ్లొచ్చాను. ఏం జరిగిందంటే.... నీరసంగా ఉండేది. ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. ఊర్లో తెలిసిన డాక్టర్‌కు చూపిస్తే ఏవో మందులు రాసిచ్చాడు. వారం రోజులు వాడినా కొద్దిగా కూడా ఫలితం లభించలేదు. ఈలోగా కళ్లు పసుపు రంగులోకి మారుతున్నాయన్న విషయాన్ని స్నేహితులు, కుటుంబసభ్యులు గమనించి చెప్పారు. దాంతో టౌన్‌కి వెళ్లి డాక్టర్‌కు చూపించాను. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని, కామెర్లు వచ్చాయని చెప్పారు. హెపటైటిస్ వైరస్ ప్రాణాంతకం అని, కాలేయం పాడయిపోతుందని చెప్పేసరికి నాలో ఆందోళన మరింత రెట్టింపు అయింది. ఆ సమయంలోనే తెలిసిన మిత్రురాలు ఒకరు హోమియో చికిత్స గురించి చెప్పింది. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత :** హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలు పెట్టాను.. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది.

## హోమియోతో సుఖవ్యాధులకు చెక్

**మా ఊరు** అనంతపురం. నా పేరు సునీల్. ఏడాది క్రితం ఆత్మహత్యకు ప్రయత్నించాను. అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డాను. నా కథ ఏంటంటే ఒకరోజు స్నేహితుల బలవంతంపైన ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో నాకు హెచ్ఐవి ఉందని నిర్ధారణ అయింది. ఆ నీటిపొక్కులకు కారణం హెర్పిస్ అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఇక నా జీవితం ముగిసిపోయిందని నిర్ధారణకు వచ్చేశాను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. హెచ్ఐవి వైరస్ ఏమీ చేయలేని స్థితిలోనే ఉండిపోతుందన్నారు. డాక్టర్‌గారుచెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

**హోమియో చికిత్స**

హెచ్ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## సంతానలేమికి చికిత్స ఉంది

**ఆధునిక** చికిత్సలు ఎన్ని అందుబాటులోకి వచ్చినా సంతానలేమితో బాధపడుతున్న దంపతులకు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయి. అయితే హోమియో మాత్రం ఇందుకు భిన్నంగా సత్ఫలితాలను అందిస్తోంది. కొందరు దంపతులు పెళ్లయి మూడేళ్లే అవుతోందిగా, ఇంకా తొందరెందుకు? మెల్లగా చూపించుకుందాలేం అని నిర్లక్ష్యంగా ఉంటారు. కానీ ఏడాదిగా ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించక పోయినప్పటికీ గర్భం రాకపోయినట్లయితే సంతానలేమి సమస్య ఉన్నట్లుగా భావించాలి. కొందరిలో పరీక్షల్లో సంతానలేమికి ఎటువంటి కారణం బయటపడదు. అన్ని పరీక్షలు నార్మల్‌గానే ఉన్నా సంతానం మాత్రం కలగదు. మరికొందరిలో సంతానం కలిగే అవకాశాలు సహజంగానే తక్కువగా ఉంటాయి. వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్రసంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి.

**హోమియో చికిత్సతో ఆనందం :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులను అందించడం ద్వారా మంచి ఫలితం లభిస్తుంది. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్యను హోమియో మందులు దూరం చేస్తాయి. మొత్తంగా సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది. దంపతుల జీవితాల్లో వెలుగులు విరజిమ్ముతాయి.

## నడుంనొప్పి ఇలా మాయమైంది

**యధావిధిగా** క్లినిక్‌లో పేషెంట్స్‌తో బిజీగా ఉన్నాను. జూనియర్ డాక్టర్ వచ్చి ఒక పేషెంట్‌ను తీసుకు వచ్చారు. నడవలేకపోతుంటే ఎత్తుకుని తీసుకువచ్చారు. పరిస్థితి సీరియస్‌గా ఉంది అని చెప్పడంతో లోపలికి పంపించమని చెప్పాను. అతని వయసు సుమారు యాభై ఉంటుంది. అమాంతం ఇద్దరు మనుషులు ఎత్తుకుని తీసుకుని వచ్చారు. ఏంటి ప్రాబ్లం అని అడిగితే ఇలా చెప్పుకొచ్చాడు." సార్ నా పేరు దయాకర్. మాది గుంటూరు. వ్యవసాయం చేస్తుంటాను. నాకు అదే జీవనాధారం. రోజూ పొలం పనులకు వెళితే తప్ప గడవదు. అలాంటి ఇప్పుడు నేను మంచానికే పరిమితమయ్యాను. ఎలాగైనా మీరే కాపాడాలి" అంటూ కన్నీళ్ల పర్యంతమయాడు. సమస్య ఎంటో క్లియర్‌గా చెప్పండి అన్నాను. "నాకు నాలుగైదేళ్లుగా నడుం నొప్పి ఉంది. పొలం పనులు ఎక్కువ చేయడం వల్ల నడుం నొప్పి వస్తుందేమో అనుకుని వదిలేసాను. ఆ తరువాత నొప్పి కాలుకు పాకింది. ఊర్లో డాక్టర్ మందులు ఇస్తే వాడాను. కొన్ని రోజులు బాగానే ఉంది. ఆ తరువాత నొప్పి ఇంకా ఎక్కువయింది. నడుం నుంచి పాదం వరకు సురుకు సురుకు మని పొడుస్తున్నట్లుగా నొప్పి ఉంటుంది. ఇప్పుడు ఒక్క అడుగు కూడా వేయలేకపోతున్నాను" అని తన సమస్యనంతా చెప్పుకొచ్చాడు. సయాటికా సమస్య అని అర్థమవుతున్నా నిర్ధారణ కోసం స్కాన్ చేయించమన్నా. సాయంత్రం రిపోర్టులతో వచ్చాడు. ఊహించినదే నిజమయింది. సయాటికా నరంపైన తీవ్రమైన ఒత్తిడి పడుతోంది. మరేం పర్వాలేదని మందులు వాడమని సూచించా. నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల ఫలితం ఉంటుంది. సరిగ్గా ఆరు నెలలు మందులు వాడాడు. ఇప్పుడతనికి నడుం నొప్పి లేకుండా పోయింది.

ADVT

